# వీక్షణం

*veekshanam fortnightly*

ఆర్థిక, సామాజిక పక్షపత్రిక

సంపుటి: 1 సంచిక: 22 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | నవంబర్ 1-15, 2004




లోపలి పేజీల్లో...




విడి ప్రతి: రూ॥ 6/-
వార్షిక చందా:రూ॥140/-లు


సంపాదకీయం:

## స్వయంపోషక (స్వావలంబన) ఆర్థిక వ్యవస్థ-జాతీయోద్యమం

-ఎ.బి.కె. ప్రసాద్

ప్రపంచ దేశాలలో పెక్కింటి స్వాతంత్ర్యోద్యమాలను ప్రభావితం చేసిన ఆదర్శాలలో, లక్ష్యాలలో ఒకటి- వలసపాలననుంచి రాజకీయ విమోచనం వలసపాలన నుంచి రాజకీయ విమోచనం పొందిన జాతులు, దేశాలు స్వయం పోషక పొందిన జాతులు, దేశాలు స్వయం పోషక ఆర్థిక వ్యవస్థలను పెంపొందిచుకోవడం. పరాయిపాలనలో సర్వస్వాన్ని కోల్పోయి కుంగిపోయిన ఆర్థిక వ్యవస్థలో విధిగా స్వావలంబన వైపుగా దీక్షతో ప్రయాణం సాగించడమూ. ప్రపంచ జాతీయోద్యమాల్లో అంతర్భాగమైన భారతదేశ స్వాతంత్ర్య సమరం ప్రధానలక్ష్యం కూడా ఈ స్వావలంబనేనని మరువరాదు. ముఖ్యంగా ఎక్కువ జనాభాగలిగిన దేశం తన అపారమైన మానవశక్తిని వినియోగంలోకి తెచ్చుకోవడం ద్వారా వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు స్వయం పోషకం కాగలుగుతాయనీ, ఉపాధి అవకాశాలను పెంచడానికి, తద్వారా నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి సమస్త వృత్తులకు పని కల్పించుకొని దేశం సుసంపన్నం కావడానికి స్వయం పోషక ఆర్థిక వ్యవస్థ మినహా మరో మార్గం లేదని ఆనాటి మన జాతి నాయకత్వం గుర్తించింది. అవైపుగా ఆలోచనలు చేసింది. కరాచీ, త్రిపుర మహా సభలద్వారా జాతీయ కాంగ్రెస్ ఈవైపుగా కొన్ని ప్రతిపాదనలు, పథకాలను సూచించింది. వ్యవసాయంపై నూటికి 70 మందికి పైగా ప్రజలు ఆధారపడిన దేశంలో భూసంస్కరణలను అమలు జరపడం ద్వారా సహజ వనరులను ఏ కొద్ది మందికో గాక సమాజపరంగా నూటికి 90 మంది సమిష్టి ప్రయోజనాలకనుగుణంగా చేసి వాటి సద్వినియోగానికి తొలి పథకాలు రచించింది. ఆ నాటి జాతీయోద్యమ నాయకత్వం ప్రజా బాహుళ్యం ప్రయోజనాలను కాపాడాలన్న ఈ తహతహలో భాగంగానే తొలితరం జాతీయ ఆర్థిక వేత్తలలో దాదాబాయ్ నౌరోజీ, ఆర్.సి.దత్తులాంటి జాతీయ వాదులు భారతదేశంలో బ్రిటీషువలస సామ్రాజ్యవాదుల దోపిడి విధానాల ఫలితంగా భారతప్రజల సంపద ఎలా ఇంగ్లాండుకు ఊడ్చుకుపోతుందో నిరూపిస్తూ వాదన చేయడమే కాక ఈ దోపిడీని అరికట్టాలంటే జాతీయోద్యమ నినాదాలతో 'స్వావలంబన'ను ఒక ప్రధాన అంశంగా చేర్చారు. ఆ తర్వాత 'హింద్‌స్వరాజ్' రచన

**వచ్చే సంచిక ఫోకస్: విదేశీ పెట్టుబడులు-ప్రపంచీకరణ**

ద్వారా భారత ప్రజలు స్వాతంత్రోద్యమ లక్ష్యాలలో ఒకటిగా స్వాతంత్రానంతర భారతదేశానికి స్వయం పోషక వ్యవస్థ అనివార్యమని గాంధీజీ చాటారు. అలాగే పారిశ్రామిక వేత్తలు పెట్టుబడిదారులు ప్రధానంగా విదేశీ గుత్తపెట్టుబడులపై ఆధారపడి ఏజెన్సీ వ్యవస్థలుగానూ, దళారీ వర్గంగానూ తయారైనందున దేశాన్ని దోచుకుంటూ వస్తున్న విదేశీయుల పెట్టుబడులను స్వాతంత్ర్యానంతరం కూడా అలాగే అట్టిపెడితే అది "నామమాత్రపు స్వాతంత్ర్యం కూడా కాదని" పండిట్ నెహ్రూ 1936 లోనే ముందు తరాలకు స్ఫూర్తిదాయకమైన సందేశం ఇచ్చారు. దేశానికి స్వాతంత్ర్యసిద్ధి తరువాత తొలిరోజుల్లో కూడా దేశానికి స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ అవసరాన్ని గురించి ఒకటికి పదిసార్లు ప్రచారం చేసిన గాంధేయ ఆర్థిక వేత్తలలో ఒకరు డాక్టర్. జె.సి. కుమారప్ప. ఈ పథకంలో భాగంగా లఘు పరిశ్రమల అభివృద్ధిని చేతివృత్తుల వారి ఉపాధిని దృష్టిలో పెట్టుకుని ఆయన స్వావలంబన సిద్ధాంతాన్ని ముందుకు నెట్టారు. ఇందుకోసం దేశ ఆర్థిక ప్రకృతి సంపదనంతనూ సమాజపరం కావాలని కోరారు. అందుకనుగుణంగానే తొలి ప్రణాళికలను కాంగ్రెస్ ప్రభుత్వం రచించింది. ప్రభుత్వ రంగాన్ని సుసంపన్నం చేయడం ద్వారా ప్రజలకు ఉపాధి అవకాశాలను స్వయం పోషక ఆర్థిక వ్యవస్థను ఎలా పెంచుకోవచ్చునో రేఖామాత్రంగా ఆ ప్రణాళికలో ప్రతిపాదించి 1948-1956 నాటి పారిశ్రామిక తీర్మానాల్ని కూడా పొందుపరిచింది. కాని ఆ తరువాత ముఖ్యంగా 1980ల నుంచి ఆ విధానం నిర్వీర్యం అవుతూ వచ్చింది. ప్రజాహితమయిన ప్రాధాన్యతలను పాలకులు తారుమారు చేసి గ్రామీణ పట్టణ రంగాలలో భూస్వాములకు, సంపన్నులకు, గుత్త పెట్టుబడిదారులకు, బడా పారిశ్రామికులకు వారి ప్రయోజనాలకు అనుకూలంగా వ్యవసాయ, పారిశ్రామిక రంగాలను తీర్చిదిద్దడం ప్రారంభించారు. స్వావలంబన విధానాకన్నా విదేశ పెట్టుబడులపై ఆధారపడే ఆర్థిక వ్యవస్థను నిర్మించుకుంటూ వచ్చారు. క్రమంగా స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి బదులు 'స్వాహాపోషక' ఆర్థిక వ్యవస్థకు బలమైన పునాదులు వేశారు. కేవలం 20, 25 బడా పెట్టుబడుదారుల కుటుంబాల "స్వయంపోషణ"కు వీలైన ఆర్థిక వ్యవస్థగా దేశ ఆర్థిక రంగాన్ని మార్చి 57 సంవత్సరాల స్వాతంత్రం తరువాత కూడ ఈరోజుకీ సుమారు 40 కోట్లమంది ప్రజలను కఠిక దారిద్ర్యంలో మగ్గపెడుతున్నారు. ఈ దశలో 1991 నుంచి అమెరికా సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష పరోక్ష నాయకత్వం కింద "గ్లోబలైజేషన్" పేరిట ప్రపంచబ్యాంకు ప్రజా వ్యతిరేక సమస్యలను భారతపాలకులు విషమ షరతులపై ఆమోదించిన ఫలితంగా ఆర్థిక వ్యవస్థలోని సకల రంగాలు సంక్షోభంలో చిక్కుకున్నాయి. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు దూరని చోటు - బిస్కెట్లు, చాక్లెట్లు, శీతలపానీయాలు, పౌడర్లు, స్లిప్పర్లు, పిన్నులు, పెన్నులు వగైరా వస్తూత్పత్తి రంగాలంటూ -ఈనాడు లేవు, లేదా "స్వాధీనాలు, విలీనాలు" (ఎక్విజిషన్స్, మెర్జర్స్) పేరిట బహుళజాతి సంస్థలయిన "మల్టీ నేషనల్" కంపెనీలు భారత పరిశ్రమలను ముందు వాటాల పేరిట, ఆ పిమ్మట పూర్తిగాను స్వాధీనం చేసుకొనే దశకు చేరుకున్నాయి. క్రమంగా ఉత్పత్తి రంగాన్ని తొలుచుకుంటూ ప్రైవేటీకరణ మంత్రం ద్వారా "ఆదర్శపాలన" పేరిట కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను ప్రైవేటీకరణ విస్తరణకు బ్రోకర్లుగా, ఫెసిలిటీ ట్రేడర్లుగా వ్యవహరించే దశకు సంస్కరణలు దిగజార్చాయి. ఇలా పరాధార స్థితికి పాలకులు దేశాన్ని నెడుతున్నారు.

డి.ఆర్. గాడ్గిల్ ప్రతిపాదనలేమైనాయి? దేశంలో స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ ఏర్పాటుకు సంరక్షణకు తపన పడిన జాతీయవాద ఆర్థిక వేత్తలలో ఒకరు ప్రొ॥డి.ఆర్. గాడ్గిల్. (1901-71) స్వావలంబన దిశగా దేశ పురోగతికి ఆచరణ సాధ్యమయిన సైద్ధాంతిక పునాదులను వేసిన వారిలో గాడ్గిల్ ఒకరు. అలాగే డాక్టర్.మహలనోబిస్ కూడా. గాడ్గిల్ దార్శనిక దృష్టికి ఉదాహరణ దేశ సాంఘిక ఆర్థిక పురోగతికి, స్వావలంబనకు ఆయన రూపొందించిన మార్గదర్శక సూత్రాలు. స్థూలంగా గాడ్గిల్ స్వావలంబన పథకంలోని ముఖ్యాంశాలివి.

1) స్వయంపోషక జాతీయార్థిక వ్యవస్థ నిర్మాణానికి విభిన్న వస్తువుల ఉత్పత్తి వ్యవస్థ నిర్మించుకోవడం 2) సమాజంలో పేర్కొన్న తీవ్రమైన సాంఘిక ఆర్థిక వ్యత్యాసాలను నిరుద్యోగాన్ని నిర్మూలించడం 3) గ్రామీణ రైతాంగానికి ప్రభుత్వానికి మధ్యలో మధ్యదళారీలెవరూ వుండకూండా చూడడం. రైతాంగం ఆర్థిక పరిస్థితులను మెరుగుపర్చి వారికి న్యాయం కలిగించడానికీ, సమాజంలోని ఇతర బలహీన వర్గాలకు ఆర్థికాభ్యున్నతిని సాధించదానికీ ఈ మధ్య దళారీ వ్యవస్థను రద్దు చేయడం అవసరం.

ఈ లక్ష్యాలను చొరవతో చైతన్యంతో సాధించడం ప్రభుత్వం,బాధ్యత అనీ, ప్రభుత్వం ఈ పనిని ప్రణాళికా బద్ధంగా,

తగునియమ నిబంధనలతో (రెగ్యులేషన్స్) నిరాఘాటంగా పూర్తి చేయాలనీ గాడ్గిల్ ప్రతిపాదించారు. అంతేగాదు, స్వాతంత్ర్యానంతరం అధికారానికి వచ్చిన పాలకులు ప్రజల సహకారంతో వారిని ముగ్గులోకి దించడం ద్వారా ప్రణాళికా యజ్ఞంలో వారిని పాత్రధారుల్ని చేయడం ద్వారా, చైతన్యం గల బురాక్రట్లు ప్రజాహితంగా వ్యవహరించడం ద్వారా స్వావలంబన లక్ష్యాన్ని చేరుకోవడం సుసాధ్యమని కూడా గాడ్గిల్ చెప్పారు. కాని దురదృష్టవశాత్తు "ప్రపంచీకరణ" నినాదం చాటున సాగుతున్న పరిణామం ప్రజలను మభ్యపెట్టి దొడ్డిదారిన ప్రజా వ్యతిరేక సంస్కరణల ద్వారా దేశాన్ని ప్రపంచబ్యాంకుకు, మల్టీనేషనల్ కంపెనీలకు అమ్మివేసే ప్రక్రియకు పాలకులు ఆశీస్సులు పలికారు.

1990-91లో కేంద్ర (పి.వి) మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిగా చేరడానికి ముందు వర్ధమానదేశాల ఆర్థిక పరాధార స్థితికి ప్రజల దారిద్ర్యానికి కారణాలను అధ్యయనం చేయడానికి టాంజానియా అధ్యక్షుడు చైర్మన్‌గా ఏర్పడిన ప్రసిద్ధ సౌత్ కమీషన్‌కు ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన ప్రపంచబ్యాంకు మాజీ ఉన్నతాధికారి నేటి ప్రధాని డాక్టర్. మన్మోహన్‌సింగ్ వర్ధమాన దేశాలకు "ఆదర్శ ప్రణాళిక"గా చెప్పుకొనదగిన ఈ సౌత్ కమీషన్ వేదిక గురించి మన్మోహన్ ఏనాడూ దేశ ప్రజలకు గుర్తు చేయలేదు. దానిక కారణం పి.వి. మంత్రివర్గంలో చేరిన మరుసటి రోజునుంచే ప్రపంచబ్యాంక్ "సంస్కరణల"కు మన్మోహన్ ఆహ్వానం పలకడం. వలసదోపిడీవలన సామ్రాజ్యవాదపాలన వల్ల అణగారిపోయిన దేశాల ప్రజలు స్వయంపోషక ఆర్థిక వ్యవస్థల్ని పెంచుకోవడం ఎందుకవసరమో చెబుతూ దేశీయ వనరులు ఆధారంగా స్వావలంబనకు వర్ధమాన దేశాలు సర్వ శక్తులా కృషి చేయాలని, పరాధార స్థితినుంచి బయట పడడానికి ఇదే ఉత్తమ మార్గమని, అంతగా విదేశీ పెట్టుబడులు కూడా అవసరం ఉందని భావిస్తే, వాటిని ఆఖరిదశలో మాత్రమే 'మందు' మాత్రంగా ఆహ్వానించవచ్చుననీ కమీషన్ 1990 నివేదిక సూచించింది. అయితే ఇందుకు కమీషన్ పెట్టిన షరతు-ముందు స్వావలంబనకు వీలుగా దేశీయంగా సకల వనరులను సమీకరించుకోవాలి. ఆ తర్వాత మాత్రమే అవసరమైతే కొద్ది మోతాదులో మాత్రమే విదేశీ పెట్టుబడిల్ని అది దేశ ఆర్థిక వ్యవస్థ స్తోమతకు లోబడి మాత్రమే తెచ్చుకోవాలని చెప్పింది! ఎందుకంటే సౌత్ కమీషన్ ఇండియా సహా వర్ధమాన దేశాల స్వయంపోషక వ్యవస్థల నిర్మాణానికి ఏ పద్ధతిని అనుసరించాలో ఇలా స్పష్టంగా నిర్ద్వంద్వంగా పేర్కొన్నది. " వర్ధమాన దేశాలు తమ వెనుకబాటు తనాన్ని, పరాధారస్థితిని అధిగమించి ఆర్థికాభివృద్ధిని న్యాయబద్ధమైన వస్తూత్పత్తి పంపిణీని నెలకొల్పి తమ సంస్కృతికి తమ ప్రజల అభీష్టానికి తగిన విధంగా తమ సమాజాల్ని ఆధునీకరించడానికి దేశీయంగానే విడుపులేకుండా నిరంతర కృషి జరగాలి. వర్ధమాన దేశాల అభివృద్ధి బాధ్యత ఎవరిచేతుల్లోనో లేదు. వర్ధమాన దేశాల చేతుల్లోనే ఉంది. ఎందుకంటే నిరంతర ప్రగతి అనేది విదేశాలనుంచి దిగుమతి చేసుకొనేది కాదు. ("SUSTAINED DEVELOPMENT CANNOT SIMPLY BE IMPORTED")! ప్రగతి లక్ష్యానికి పునాది ప్రజలు మాత్రమేనని గ్రహించాలి. అభివృద్ధికి సంబంధించిన వ్యూహాలకు, వాటి అమలుకు రూపకర్తలు, నిర్వాహకులు ప్రజలు మాత్రమే కావాలి... అభివృద్ధి అంటే ఏమిటి? అదొక నిర్వహణ క్రమం. తమలో అంతర్లీనంగా వున్న శక్తి యుక్తుల్ని మానవులు గుర్తించేటట్టు, తద్వారా వారి ఆత్మవిశ్వాసాన్ని పెంచుకొనేట్టు, తద్వారా వారు హుందాగా గౌరవ ప్రదంగా తమ ఆశలను ఫలింప చేసుకొనేటట్టు తోడ్పడగలిగిందే ప్రగతి. ఈ అభివృద్ధి క్రమం ఆచరణలో ప్రజా బాహుళ్యాన్ని దోపిడీనుంచి దారిద్ర్యం నుంచి విముక్తి చేసేదిగా వుండాలి. ఈ మహోద్యమం రాజకీయ, ఆర్థిక, సాంఘిక దోపిడీకి దూరంగా సాగాలి. ఈ ప్రగతి క్రమంద్వారానే సాధించుకున్న రాజకీయ స్వాతంత్ర్యానికి నిజమైన ప్రాధాన్యత వస్తుంది. ఈ ప్రగతి ఉద్యమం పైనుంచి గాకుండా, సమాజం నుంచి పుట్టుకురావాలి. కాబట్టి అభివృద్ధి అంటే ఒక్క మాటలో స్వయంపోషక వ్యవస్థ అనే, లేదా స్వావలంబన అనే. ఈ స్వావలంబన వ్యక్తి స్థాయిలోను, సమిష్టిగాను జరగాలి. జాతీయాభివృద్ధికి పునాది దేశీయ వనరులు మాత్రమే దేశ మానవ సంపద, భౌతిక సంపద మాత్రమే పునాదిగా వుండాలి. తద్వారా దేశం తన అవసరాలను తీర్చుకోవడానికి ఈ వనరులను పూర్తిగా వినియోగంలోకి తెచ్చుకోవాలి. అందువల్ల స్వావలంబనపైనే, స్వయంచోదక శక్తిపైనే ప్రగతి ఆధారపడాలి. ఇక్కడొక సంగతి గమనించాలి. దేశం అంటే మనుషులనీ, ప్రజలనీ కాబట్టి దేశాభివృద్ధి ప్రజల చేత, ప్రజల కోసం ప్రజలు చేసుకోవలసిన అభివృద్ధి. ప్రజాధార, ప్రజాహిత అభివృద్ధే అభివృద్ధి. మానవ శక్తి యుక్తుల్ని పూర్తిగా వినియోగించుకొనే విధంగా ప్రజా బాహుళ్యపు సాంఘిక, ఆర్థిక శ్రేయస్సు సంక్షేమాభివృద్ధి కోసం ఈ ప్రగతి క్రమాల్ని నిర్వహించుకోవాలి. ప్రజలు తమ సామాజిక ఆర్థిక అవసరాలకు అనుగుణంగా ప్రజలే ప్రగతి మార్గాన్ని నిర్దేశించుకోవాలి".

# ఆర్థిక వ్యవస్థలో స్వావలంబనకు తిలోదకాలిచ్చిన భారత్

-ప్రొ॥ కె.ఆర్. చౌదరి

ఆర్థికవ్యవస్థలో స్వావలంబన అంటే మన అవసరాలకు ...వాల్సిన వస్తువులను మనమే మనదేశంలోనే మన వనరులను, ...మశక్తిని వినియోగించుకుని ఉత్పత్తి చేసుకొంటాం. ఉత్పత్తి, ...ంపిణీ, సేవ, మార్కెటింగ్ రంగాల్లో స్వావలంబన ఉంటే సంపద ...మకూరుతుంది. దీనిపైన మన ఆధిపత్యమే కొనసాగుతుంది. మన ...భివృద్ధికి దోహదపడుతుంది. ఉపాధి సౌకర్యాలు పెరుగుతాయి. ...జల కొనుగోలు శక్తి మెరుగు అవుతుంది. ప్రజల జీవనస్థాయి ...రుగుతుంది. కానీ, దేశ ఆర్థిక వ్యవస్థను, స్వావలంబనను కొన్ని ...లమైన శక్తులు విధ్వంసం చేస్తున్నాయి. అవి బహుళజాతి సంస్థలు, ...లాఖత్ దారులు, సామ్రాజ్యవాద దేశాలు. ఈ శక్తులు మన ...ాలకవర్గాలను గుప్పెట్లో పెట్టుకుంటున్నాయి. ఈ శక్తులు ...రుగానూ, అంతర్జాతీయ ద్రవ్య, ఆర్థిక సంస్థలు, ...పంచవాణిజ్యసంస్థ ద్వారానూ, తమకు లాభాలు చేకూర్చేవీ, తమ ...త్తాధిపత్యాన్ని పెంచేవీ అయిన విధానాలను బీద దేశాల నెత్తిన ...ద్దుతున్నాయి. సరళీకరణ, ప్రయివేటీకరణ, ప్రపంచీకరణ మొదలైన ...జా వ్యతిరేక విధానాలను మన పాలకవర్గాలు సామ్రాజ్యవాద శక్తుల ...త్తిడితో అమలు చేస్తున్నాయి. ఈ విధానాలు మన స్వావలంబననూ, ...ర్థిక వ్యవస్థనూ దెబ్బతీస్తున్నాయి.

### ...ఫ్రికా-ప్రపంచబ్యాంక్

స్వావలంబనను దెబ్బకొట్టే ప్రపంచబ్యాంక్ విధానాలను గురించి ...ఫ్రికా దేశాల అనుభవాల నుండి గ్రహించాల్సిన అవసరముంది. ...0 ఏళ్ళక్రితం మొరాకో, ఇథోపియాలు ఆఫ్రికా ధాన్యాగారాలుగా ...సిద్ధిచెంది వుండేవి. తమ ఆహారధాన్యాల విషయంలో స్వావలంబన ...ండేది. ప్రపంచబ్యాంక్ తన విధానాలను ఆదేశాలపై రుద్దిన ...లితంగా ఆహారధాన్యాల ఉత్పత్తి తగ్గి, వాణిజ్య పంటల ఉత్పత్తి ...రిగింది. వాణిజ్య పంటల ఉత్పత్తుల ఎగుమతుల ద్వారా డాలర్ల ...ర్షం కురిసింది. ఆ డాలర్లతో గోధుమలు, తదితర ఆహార ధాన్యాలను ... దేశాలు దిగుమతులు చేసుకున్నాయి. ఈ భాగ్యం ఎంతో కాలం ...నసాగలేదు. గోధుమ ధరలు రెండేళ్ళలోనే విపరీతంగా అమెరికా ...ంచింది. పైగా, ఈ దేశాల వాణిజ్యపంటల ఉత్పత్తుల ధరలను ధనిక దేశాలు తగ్గించివేశాయి. ఉత్పత్తుల ధరలను ధనిక దేశాలు తగ్గించివేశాయి. అందువల్ల డాలర్ల రాబడి పడిపోయింది. ఈ దేశాలు ఆహారధాన్యాలను కొనలేకపోయాయి. పంటల సరళిలో మార్పిడి కారణఃగా, ఆహారధాన్యాల విస్తీర్ణం తగ్గి, ఆహారోత్పత్తి కనిష్ఠ స్థాయికి దిగజారింది. ఈ కారణాలవల్ల లక్షలాదిమంది ప్రజలు ఆహారం దొరకక ఆకలిచావులకు గురి అయ్యారు. ప్రపంచబ్యాంక్ విధానాల అమలు వల్ల వేలాది ఎకరాల భూమి కంపెనీ సేద్యం క్రిందకు వచ్చింది. వ్యవసాయరంగంలో భారీ యాంత్రీకరణ జరిగింది. సన్నకారు, చిన్నకారు రైతులే కాకుండా మధ్యతరగతి రైతులు కూడా నిరంతర నిరుద్యోగానికి, శాశ్వత వలసలకు నెట్టబడ్డారు. స్వావలంబన విధానాలకు ఉద్వాసన పలకడమే ఆఫ్రికా దేశాలను దోపిడీ, పీడనలకు గురిచేసింది. ఆర్థిక వ్యవస్థను అస్తవ్యస్తం చేసి ప్రజలను కడగండ్ల పాలు చేసింది.

### వ్యవసాయరంగంలో

భారత్ కూడా అలాంటి దారుణ పరిస్థితిని ఎదుర్కోబోతోంది. వ్యవసాయరంగాన్ని నిర్లక్ష్యంచేసినందువల్ల స్వావలంబనకు విఘాతం కలుగబోతోంది. వ్యవసాయరంగ నిర్లక్ష్యం, అతి తక్కువ మోతాదులో వున్న ప్రణాళిక కేటాయింపులు, బడ్జెట్ కేటాయింపులు, వ్యవసాయరంగంపై తరిగిపోతున్న ప్రభుత్వ వ్యయమే కాక ప్రభుత్వ దీర్ఘకాలిక పెట్టుబడులు, పతనమవుతున్న మూలధనం, మొదలైన వాటి ద్వారా బట్టబయలవుతోంది.

ప్రభుత్వం, బ్యాంకులు వ్యవసాయరంగానికి రుణ సదుపాయం కల్పించడంలో ఎంతో వెనుకబడియున్నాయి. సాగునీటి ప్రాజెక్టులను నిర్లక్ష్యంచేసింది. వ్యవసాయానికి అవసరమైన కరెంట్ కటకటలను తెచ్చిపెట్టింది. ఉత్పాదకాల ధరల సబ్సిడీల తగ్గింపు, మరితర కారణాల వల్ల పెరిగాయి. సాంకేతిక పరిజ్ఞానం రైతాంగానికి పూర్తిగా అందడంలేదు. మార్కెట్ దోపిడీ, ధరల పతనం, అందని మేడిపండు అయిన బీమా సౌకర్యం మొదలైన కారణాలతో పాటు, పైన పేర్కొన్న అంశాలన్నీ వ్యవసాయరంగంలో మన స్వావలంబనకు మంగళం పాడుతున్నాయి. అందువల్ల, ఆహార భద్రతకు ముప్పు వాటిల్లుతోంది.

రైతాంగం జీవనాధారాన్ని కోల్పోతున్నారు. ఆ విధంగా మన వ్యవసాయ రంగంలో స్వావలంబన నాశనమవుటమే ధనిక దేశాల ఆకాంక్ష, ఎత్తుగడ. అప్పుడే, ఆ దేశాలు తమ వ్యవసాయోత్పత్తులను మన దేశంలోకి ప్రవహింప చేసుకొంటాయి. మన మార్కెట్లను కొల్ల గొట్టుకుంటాయి.

మనదేశంలోని ప్రకృతి వనరులు మన ఉత్పత్తులను పెంచుకోవడానికి కాకుండా, మన స్వావలంబనకు కాకుండా పోతున్నాయి. ప్రకృతి వనరులైన భూమి, నీరు, అడవులు, గనులు, మరియు చవుకగా లభించే మానవ శ్రమశక్తిపై సామ్రాజ్యవాద శక్తులు, బహుళజాతి కంపెనీలు ఆధిపత్యం సాధించుకుంటున్నాయి. మన దేశంలోని ఉత్పత్తిపై పట్టును గట్టిగా బిగిస్తున్నాయి. కోట్లాదిమందికి జీవనోపాధిని కల్పిస్తున్న భూమి, దేశ ఆర్థిక వ్యవస్థకు పునాదిగా ఉన్న భూమి సామ్రాజ్యవాద శక్తుల అధీనంలోకి పోతుంది. విత్తనాలు, తోటలు, వనమూలికలు మొదలైన వాటిసాగుకూ, జీవశాస్త్ర సాంకేతిక పార్కులు, వాణిజ్య విద్యాసంస్థలు, పర్యాటక పార్కులు, క్లబ్బులు మొదలైన వాటికోసం బహుళజాతి సంస్థలు భూమిని వినియోగించు కుంటున్నాయి. ఇప్పటికే మన భూమిలో 5 శాతాన్ని విదేశీ కంపెనీలు కైవసం చేసుకున్నాయని డాక్టర్ బి.డి.శర్మ నివేదించారు. కార్పోరేట్ వ్యవసాయం, కాంట్రాక్ట్ వ్యవసాయం పేర్లతో విదేశీ కంపెనీలు మన భూమిపై పెత్తనం సంపాదించుకొంటున్నాయి. దేశంలో అనేక చోట్ల నీటిని విదేశీ కంపెనీలైన పెప్సీ, కోకో కోలా కంపెనీలు భారీ ఎత్తున వాడుకుంటున్నాయి. మనరాష్ట్రంలోనే రోజుకు కొన్ని లక్షల లీటర్ల నీటిని వాడుకుంటున్నాయి. సీసాల్లో తాగునీటికి, శీతల పానీయాల ఉత్పత్తికి నీటిని వాడుకుంటున్నాయి. శీతల పానీయాల్లో పురుగుమందుల అవశేషాలు ఎక్కువగా ఉన్నాయనీ, వాటిని తాగితే ఆరోగ్యానికి భంగకరమనీ, నిజనిర్ధారణ కమిటీలు తేల్చి చెబుతున్నాయి. సాగునీటిని, తాగునీటిని కూడా వ్యాపార సరుకుగా బహుళజాతి కంపెనీలు మారుస్తున్నాయి. అడవులపైన విదేశీ కంపెనీల ఆధిపత్యం వల్ల అడవులపైన ఆధారపడి బతికే వారి జీవితాలు ఛిన్నాభిన్నం అవుతాయి. ఖనిజవనరులను, శ్రమశక్తిని కంపెనీలు లూటీ చేస్తున్నాయి. ఎంతో విలువైన ఖనిజాలు తరలిపోతున్నాయి. అంతే కాకుండా, వ్యవసాయ ఉత్పాదకాలపైన గుత్తాధిపత్యం సాధించుకొంటున్నాయి. ఇప్పటికే విత్తనాల తయారీ, వ్యాపారంలో 30 శాతం, రసాయనిక ఎరువుల సరఫరాలో 20 శాతం, పురుగుమందుల తయారీ, మార్కెటింగ్‌లో 90 శాతం విదేశీ కంపెనీల స్వాధీనంలో ఉన్నాయి. వ్యవసాయ ఉత్పాదకాల విషయంలో మనకు స్వావలంబన లేదు. విదేశీ కంపెనీలపైన ఆధారపడాల్సిన దుస్థితి ఉంది.

**పారిశ్రామికరంగంలో**

పారిశ్రామికరంగంలో నానాటికీ స్వావలంబన తగ్గిపోతోంది. పరిశ్రమలు మూతపడుతున్నాయి. పారిశ్రామిక ఉత్పత్తి అభివృద్ధి రేటు పతనమవుతోంది. పారిశ్రామిక స్వావలంబనకు ప్రభుత్వ విధానాలు ఏ మాత్రం అనుకూలంగా లేవు. పారిశ్రామికులకు లాభాలే ప్రధానం. సాంప్రదాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని, కాలం చెల్లిన యంత్రాలనే పారిశ్రామిక ఉత్పత్తిలో వాడుతున్నారు. నూతన ఆవిష్కరణలకు, పరిశోధనలకు పారిశ్రామిక వేత్తలు ఖర్చు పెట్టడం లేదు. అందువల్ల, ఉత్పత్తి ఖర్చు లెక్కువ. ఉత్పత్తులకు నాణ్యతలేదు, పైగా, నాణ్యత లేదు. అందువల్ల, విదేశీ కంపెనీలతో పోటీ పడలేరు. పారిశ్రామిక ఉత్పత్తుల దిగుమతుల ప్రవాహం మన స్వావలంబనను దెబ్బతీస్తోంది.

చిన్న పరిశ్రమల విషయంలో సంక్షోభం మరింత తీవ్రంగా ఉంది. కొన్ని వస్తువుల ఉత్పత్తిని ఈ రంగానికే ప్రత్యేకంగా కేటాయించడం ఎప్పటినుండో ఉంది. ప్రభుత్వం అనేక వస్తువుల ఉత్పత్తిని ఈ రిజర్వేషన్ నుండి తొలగించింది. నూతన సాంకేతిక పరిజ్ఞానం లేదు. కొత్త యంత్రాలు లేవు. విద్యుత్ సరఫరా నిరాటంకంగా లేదు. ఛార్జీలెక్కువ. ముడిసరుకుల సరఫరా లేదు. ఉత్పత్తులకు గిరాకీ లేదు. చవుకగా వస్తువులు విదేశాల నుండి వస్తున్నాయి. మూడు లక్షల చిన్న పరిశ్రమలు, 20 లక్షల మైక్రోయూనిట్స్, మూతపడ్డాయని నివేదికలు చెబుతున్నాయి. చిన్న పరిశ్రమల రంగం తుడిచిపెట్టుకుని పోతుందని అప్పటి ఆర్థికమంత్రి యశ్వంత్ సిన్హాయే అంగీకరించారు. లక్షలాదిమంది కార్మికులు ఉపాధి కోల్పోయారు.

**విదేశీ వాణిజ్యం**

విదేశీ వాణిజ్యం మన స్వావలంబనకు గొడ్డలిగా పరిణమించింది. ప్రభుత్వం దిగుమతులపైన నిషేధం తొలగించింది. పరిమాణాత్మక ఆంక్షలను రద్దు చేసింది. అతి తక్కువ స్థాయిలో దిగుమతి సుంకాలను విధిస్తోంది. అందువల్ల, వ్యవసాయోత్పత్తుల దిగుమతుల ప్రవాహం ఊపందుకొంది. పత్తి, వంటనూనెలు, చక్కెర, పాలు, పాల

ఉత్పత్తులు, కాఫీ, టీ, పండ్లు, తదితర వ్యవసాయోత్పత్తుల దిగుమతులు ఎక్కువ అయ్యాయి. పైగా, 5 శాతం ఆహార ధాన్యాలను విధిగా దిగుమతి చేసుకోవాలనే డబ్ల్యుటివో ఒప్పందముంది. వ్యవసాయోత్పత్తుల దిగుమతులు మన ఆర్థిక వ్యవస్థనే కుప్ప కూల్చగలవు. స్వావలంబనను అంతం చేయగలవు.

దేశ ప్రజల నిత్య జీవితంలో పరాధీనత పెరిగిపోతోంది. గతంలో, సాంప్రదాయకంగా, స్థానికంగా లభించే అనేక వస్తువులను ప్రజలు వాడేవారు. ఇప్పుడు పూర్తిగా తారుమారయింది. కోకొల్లలుగా ఉదాహరణలున్నాయి. అనేక నివేదికలనుండి, మూలాలనుండి, గణాంక వివరాలు లభ్యమవుతున్నాయి.

గతంలో జనం నోరు శుభ్రం చేసుకోవడానికి వేపపుల్ల, పందుంపుల్ల, పళ్ళపొడి వాడేవాళ్ళు. గత కొన్ని సంవత్సరాలుగా టూత్‌పేస్ట్, బ్రష్‌ల వాడకం పెరిగిపోయింది. మారుమూల పల్లెల్లోకి సైతం ఈ సంస్కృతి విస్తరించింది. కోల్గేట్, పామోలివ్, హిందుస్తాన్ లివర్ తదితర విదేశీ కంపెనీలు వీటిని ఉత్పత్తి చేసి సరఫరా చేస్తున్నాయి. స్వదేశీ కంపెనీల మార్కెట్‌వాటా తక్కువగా ఉంది. మన కంపెనీలు మూతపడుతున్నాయి. ఈ వ్యాపారంలో దాదాపు 000 కోట్ల రూపాయలను ఏటా విదేశీ కంపెనీలు దండుకుంటున్నాయి. స్నానానికి, బట్టలు ఉతికేందుకు అవసరమైన సబ్బులు, విదేశీ కంపెనీలనుండే వస్తున్నాయి. స్వదేశీ కంపెనీల వాటా బహుకొద్ది. విదేశీ కంపెనీల ధాటికి తట్టుకోలేక వేలాది చిన్న చిన్న సబ్బుల ఫ్యాక్టరీలే కాక పెద్ద ఫ్యాక్టరీలు కూడా మూతపడ్డాయి. ఏటా రూ. 10,000 కోట్ల రూపాయలు విదేశీ కంపెనీల వశమవుతున్నాయి. గతంలో తలస్నానానికి కుంకుడు, సీకాయి వాడేవారు. ప్రస్తుతం షాంపూలు వచ్చాయి. ఏటా రూ. 700 కోట్లు విదేశీ కంపెనీలు దండిస్తున్నాయి. సాంప్రదాయంగా, భారత మహిళలు సౌందర్య పోషణకు పసుపు పారాణి, గంధం, గోరింటాకు వాడేవారు. నేడు విదేశీ కంపెనీలు సౌందర్య పోషణకు తయారు చేసిన అనేక రకాల వస్తువులను వాడుతున్నారు. వీటి గిరాకీ పెరుగుతోంది. దాదాపు రూ.10,000 కోట్ల రూపాయలు ఏటా విదేశీ కంపెనీలు సంపాదించుకొంటున్నాయి. ప్రతి సంవత్సరమూ 20 శాతం గిరాకీ పెరుగుతుంది.

పాలు, కొబ్బరినీళ్ళు, స్వదేశీ పానీయాలస్థానే విదేశీ శీతల పానీయాలు దేశంలో విస్తారంగా, విచ్చల విడిగా వాడకంలోకి వచ్చాయి. దాదాపు రూ. 28,000 కోట్ల కోకో కోలా, పెప్సీ కంపెనీలే తరలించుకుని పోతున్నాయి. పసిపిల్లల ఆహారాలయిన తల్లిపాలు, ఉడికించిన కూరగాయలు, అన్నం, పప్పు, గంజి, పప్పు బెల్లాలు, స్వదేశీ బిస్కట్లస్థానే విదేశీ సరుకులయిన సిరిలెక్స్, ఫ్యారెక్స్, ఛాక్లెట్లు, విదేశీ బిస్కట్లు, అయిస్ క్రీములు మొదలైనవి వాడకంలోకి వచ్చాయి. దాదాపు రూ. 5,000 కోట్లు విదేశీ కంపెనీలు పొందుతున్నాయి. సైకిళ్ళు, మోటారు సైకిళ్ళు, స్కూటర్లు, కార్లు, ఔషధాలు, విద్యుత్ పరికరాలు, చెప్పులు, సిగరెట్లు, గడియారాలు, గుడ్డలు, వాషింగ్ మిషన్లు, రెఫ్రిజిరేటర్లు, టెలివిజన్లు, మొదలైన వెన్నో విదేశీ కంపెనీల నుండి వస్తున్నాయి. 80 శాతం వస్తువులు మన కంపెనీల నుండి రావు.

అనేక రూపాల్లో దేశ సంపద తరలిపోతోంది. పెట్టుబడులపైన ఆదాయాలు, అప్పుపైన వడ్డీ, వ్యాపారం ద్వారా మనకష్టం, మొదలైన రూపాల్లో దాదాపు రూ. 25,000 కోట్లు మనదేశం నుండి తరలిపోతున్నాయి. మన జాతీయ ఆదాయంలో 20 శాతం ప్రతి ఏటా తరలిపోతోంటే, స్వావలంబన సాధ్యం కాదు. పైగా, పరాధీనత పెరిగిపోతుంది. దేశంలో నిరుద్యోగం ప్రబలిపోతుంది. దేశ సంపద అభివృద్ధి కాదు. స్వావలంబన ఆర్థిక వ్యవస్థ లేనందువల్ల అన్ని వర్గాల ప్రజలు నష్టపోతారు.

స్వావలంబన ఒక కల అనీ, ప్రపంచీకరణ ప్రక్రియ ఆగదనీ అంటున్నారు. స్వావలంబన కలకాదు. దాన్ని సాధించడం అంత సులభం కాకపోవచ్చు. కానీ, దేశం ఎదుర్కొంటున్న సమస్యలకు అదొక్కటే పరిష్కారం. స్వావలంబన సాధించుకోవడానికి అవసరమైన కార్యక్రమాన్ని రూపొందించుకుని అమలు చేయాలి. ఆహార, జీవన భద్రతలకు ప్రాధాన్యతనివ్వాలి. బీదవర్గాల వారికి ఆర్థిక, సామాజిక న్యాయం ఒక ప్రధానమైన ఆశయం కావాలి. వ్యవసాయ, పారిశ్రామిక అభివృద్ధికి అవసరమైన విధివిధానాలు రూపొందించుకోవాలి. పరాధీనతను పారదోలాలి. స్వతంత్ర ఆర్థిక వ్యవస్థను నిర్మించుకోవాలి. తక్కువ పెట్టుబడులు పెట్టి, అధిక లాభాలను దండుకుని, మన సంపదను తరలించుకుని పోయే విదేశీ కంపెనీల కుట్రలకు, ఆగడాలకు అడ్డుకట్టువేయడం అవసరం. మనకున్న అపారమైన ప్రకృతి వనరులు, మానవ శ్రమశక్తిని ఉపయోగించుకోవాలి. స్వావలంబనకు ఇది అత్యవసరం. కానీ, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద శక్తులను ధ్వంసం చేయనిదే స్వావలంబన సాధ్యం కాదు.



# భారత్‌ను స్వావలంబిత దేశంగా మలచుకోవాలి

-అప్పాల ప్రసాద్
రాష్ట్ర కార్యదర్శి, స్వదేశీ జాగరణమంచ్

తన కాళ్ళపై నిలబడగలిగే సమర్ధవంతమైన స్వావలంబన సమాజం మాత్రమే ప్రపంచంలో మనుగడ సాగించగలదు. విదేశీ సహాయం, అనుకరణలతో ఎక్కువకాలం సమాజం జీవించలేదు. స్వాతంత్ర్యం సంపాదించి 57 సంవత్సరాలైన తర్వాత నేడు స్వావలంబన గురించి చర్చించుకోవడం శోచనీయం. కనీసం ఇప్పటికైనా పాలకులు, ప్రభుత్వ యంత్రాంగం, ప్రణాళికా వేత్తలు, మేధావులు, పార్టీలు, పౌరులంతా కళ్ళు తెరచి భారత్‌ను స్వావలంబిత దేశంగా మలుచుకోవలిన సమయం ఆసన్నమైందని గుర్తించాలి.

స్వావలంబన గురించి మాట్లాడుతున్నపుడు గాంధీజీ ఈ దేశ ప్రజలపై చెరగని ముద్ర వేశారన్నది నిర్వివాదాంశం. పండిట్ జవహర్ లాల్ నెహ్రూను ఉద్దేశించి గాంధీజీ 1928లో మరియు 1945లో వ్రాసిన లేఖల్లో గ్రామ స్వరాజ్యం, స్వావలంబన, స్వదేశీ గురించి ప్రత్యేకంగా పేర్కొన్నారు. గాంధీజీ మాటలను పెడచెవిన పెట్టిన ఫలితాన్ని నేడు ఈ సమాజం అనుభవిస్తున్నది. 1947 నుండి 1986 వరకు ఈ దేశంలోని ప్రజలకు ఎటువంటి ప్రయోజనం కలిగించే విధానాలూ రూపొందించబడలేదు. 1986 తర్వాత ప్రపంచంలో వచ్చిన పరిణామాల నేపథ్యంలో ఆర్థిక సంస్కరణల పేరుతో కొత్త విధానాలకు ఒక్కసారిగా ప్లేటు ఫిరాయించడంతో దాని దుష్పరిణామాలు కూడా సామాన్య ప్రజలు ఇప్పటికీ ఎదుర్కొంటున్నారు. ప్రతి విషయంలోనూ ప్రభుత్వ జోక్యం అలాగే గ్లోబలైజేషన్ పేరుతో కొన్ని స్వదేశీ బహుళజాతి కంపెనీలకు వత్తాసు పలికే విధానాలను ఈ సమాజం రుచి చూసింది.

ఇవన్నీ పరిశీలించిన పిదప మధ్యే మార్గంగా భారతదేశ స్వభావానికీ, ప్రజల ఆలోచనలకు, అలవాట్లకు, భౌగోళిక పరిస్థితులకు అనుగుణమైన అభివృద్ధి వధకాలను రూపొందించినపుడు మాత్రమే అది స్వావలంబనగా పేర్కొనగలం. స్వాతంత్ర్యం పొందిన వెంటనే ఇక్కడి భూమి, నీరు, అడవులు, పశువులు, ప్రజలు-మొదలైన ప్రాథమిక అంశాలను ఇక్కడి పాలకులు మరిచిపోయారు. ప్రజలకు రెండు పూటలా తిండి పెట్టనిదే, పశువుల ఆధారంగా సమృద్ధిగా ధాన్యాలను పండించనిదే దేశ ప్రగతి ఎలా సాధ్యమౌతుంది? కట్టుకోవడానికి బట్ట లేని స్థితిలో కీర్తి కండూతి కోసం టోపీలు పెట్టుకుంటే ఏం లాభం? అందుకే ప్రజల భాషను, వస్త్రాలను, వసతులను, మందులను, ప్రజలకు అందించే సుసంపన్న వ్యవస్థను తీర్చి దిద్దక పోవటం ఒకపెద్ద దోషంగా చెప్పుకోవచ్చు.

ఈ దేశపు భౌగోళిక పరిస్థితులను, స్వభావాలను అధ్యయనం చేయకుండా విదేశీ అనుకరణ వల్ల ఈ ప్రజలకు ఒరిగేదేమీ లేదు. ఉదాహరణకి భారత్‌లో సూర్యుడు పదినెలలకు మించి కనబడితే ఇంగ్లండులో రెండున్నర నెలలు మాత్రమే సూర్యుడు కనబడతాడు. ఈ దేశంలో సూర్యరశ్మి ఎక్కువున్న కారణంగా గోవులపై మూపురాలు ఏర్పడతాయి. అందుకే వ్యవసాయానికి వాటిని ఉపయోగిస్తాము. పశువుల పేడలో (30 డిగ్రీల) సూర్యరశ్మి వల్ల గోబర్‌గ్యాస్ ఉత్పన్నమౌతుంది. 60వేల వనస్పతులు, 40 వేల పశు పక్ష్యాదులతో కూడిన జీవ వైవిధ్యం (బయో డైవర్సిటీ) ఉంటుంది. అదే ఇంగ్లండులో సూర్యరశ్మి లేని కారణంగా గోసంతతి వ్యవసాయానికి యోగ్యమైనవి కావు. అందుకే గుఱ్ఱాలతో పొలాలు దున్నుతారు. హార్స్ పవర్ అనే మాట అక్కడి నుండి వచ్చినదే. అక్కడి గోవులకు మూపురం ఉండదు. వాటి పేడ ద్వారా గ్యాస్ ఉత్పన్నం కాదు. ఇక్కడి పంట భూముల్లో గోధుమలు మూడుసార్లు పండించుకోవచ్చును. ఇంగ్లండులో గోధుమలు పండాలంటే 7 నెలల సమయం పడుతుంది. ఈ విధంగా భౌగోళిక పరిస్థితులననుసరించి మన దేశంలో విధానాలు రచించాలి. 200 సం॥ల పూర్వం ప్రపంచ వ్యాపారంలో భారతదేశం వాటా 18 శాతం. ఇంగ్లండు వాటా 7 శాతం, అమెరికా వాటా 2 శాతం. వస్తూత్పత్తిలో భారత్ వాటా 17 శాతంతో అగ్రస్థానంలో ఉండేది. అక్షరాస్యతలో 33 శాతం ఉన్న దేశం ఆంగ్లేయుల పాలన తొలగిన తర్వాత ప్రపంచ వ్యాపారంలో ఒక శాతం కూడా మించలేదు. ఎందువల్ల? ఆంగ్లేయులు రూపొందించిన చట్టాలనే ఇప్పటికీ అనుకరించే దుస్థితి కలుగుతున్నది. ఫలితంగా గ్రామీణ వ్యవస్థ ధ్వంసమై నగరీకరణ, కేంద్రీకరణ, మార్కెటీకరణ వైపు పయనిస్తూ దేశ ప్రజలు విషవలయంలో చిక్కుకుంటున్నారు. గ్లోబలైజేషన్ పేరుతో అమెరికనైజేషన్ తృతీయ ప్రపంచదేశాలపై బలవంతంగా రుద్దబడుతున్నది. ప్రజల సంక్షేమం కంటే పెట్టుబడికి, సంబంధాలు దెబ్బతీసే ధనార్జనే లక్ష్యంగా సామాజిక వ్యవస్థలు చిన్నాభిన్నమౌతున్నాయి.

దేశ జనాభాలో మొదటి అంతస్థు 10 కోట్ల మందిలో- వీరి కుటుంబ సభ్యులు కొందరు విదేశాల్లో ఉంటున్నారు- అధికాంశం

స్వాభిమాన శూన్యత. న్యూనతా భావంతో జీవిస్తున్నారు. రెండవ భాగం 20 కోట్ల జనాభా భౌతిక సమృద్ధులతో నివసిస్తున్నారు. మూడవ భాగం 70 శాతం ప్రజలు భద్రతా రాహిత్యంతో బ్రతుకులు వెళ్ళదీస్తున్నారు. ఈ అసంతులనాన్ని తొలగించకపోతే ఆరోగ్యం, జీవనోపాధి, పర్యావరణం, సాంఘిక సంబంధాలు, ఆర్థిక వ్యవస్థ, శాస్త్ర సాంకేతిక రంగాలు, రాజకీయాలు అన్నీ కూడా ఇంతకు ముందు ఎన్నడూ లేనంతగా తీవ్ర సంధిగ్ధావస్థలో పడిపోతాయి.

ఈ తరుణంలో స్థానీయ వ్యవస్థను స్వావలంబన దిశలో బలంగా తీర్చిదిద్దాలి. స్థానీయ వనరులు, సాంకేతిక పరిజ్ఞానం, నైపుణ్యం, ప్రణాళిక ఆధారంగా అభివృద్ధి జరగాలి. అంతేకాని అమెరికాలో కూర్చుని రిమోట్ కంట్రోల్‌తో ఇక్కడి ప్రజల జీవితాలను మెరుగుపర్చటం సాధ్యం కాదు. భారతదేశం విషయానికొస్తే స్వావలంబన అనేది కొత్తగా రూపొందించే వ్యవస్థ కాదు. కొన్ని వందల సంవత్సరాలనుండి దేశంలో కుటుంబాలు, కులాలు (కమ్యూనిటీలు) అంతర్గతంగా ఒక వ్యవస్థగా ఏర్పడి సామాజిక, ఆర్థిక అభివృద్ధిని చేస్తూ వస్తున్నాయి. ఉదాహరణకు ప్రతికుటుంబం-తన ఖర్చును, పొదుపును, పెట్టుబడిని ఎలా కొనసాగించాలో మరొకరు చెప్పవలసిన పనిలేదు. సామూహికంగా చేయవలసిన పని ఇది. జరుగుతూనే వుంది.

* స్వావలంబనలో మొదటి అంశం ఆర్థిక వ్యవస్థను నడపటంలో ప్రభుత్వానిది ప్రధాన పాత్ర కాదు. కమ్యూనిటీలు కొన్ని రకాల సమాజాలు ముఖ్యపాత్ర పోషిస్తాయి. రాజుకి ఎంత అధికారమున్నా గ్రామ పంచాయతి అనుమతి లేకుండా భూమిని స్వాధీనం చేసుకోవటానికి వీల్లేదు. ఇప్పటికీ గ్రామపంచాయతి అనుమతి లేకుండా ఎటువంటి పని చేయటం ప్రభుత్వానికి కుదరని పని. కమ్యూనిటేరియన్ లక్షణాలు కలిగిన భారత్ ఆర్థిక వ్యవస్థ స్వావలంబన ఎన్నదగినది.

* పాశ్చాత్యదేశాలు కాంట్రాక్ట్ ఆధారంగా జీవితాలను కొనసాగిస్తాయి. ఈ దేశం మానవ సంబంధాలు ఆధారంగా సంప్రదాయ సమాజాలుగా కొనసాగుతాయి.

* ఈ సాంప్రదాయ (పరంపరాగత) సామాజిక పెట్టుబడి "స్వదేశీ"కి ఆధారం. స్వావలంబిత ఆర్థిక వ్యవస్థను నడిపేది ఇదే. ఉదాహరణకు విదేశాల్లోనైతే వృద్ధులను నిరుద్యోగ యువతీ, యువకులను పోషించే బాధ్యత ప్రభుత్వాలు మీద వేసుకుని కోట్ల రూపాయలు ఖర్చు పెడతాయి. మన దేశంలో వీరి సామాజిక బాధ్యతగా కుటుంబం తీసుకుంటుంది. ఈ కుటుంబాలలో చేసిన పొదుపు 23 శాతం కరెన్సీలోనైతే 12 లక్షల యాభైవేల కోట్ల రూపాయలు (12,50,000కోట్లు). ఇంత పెద్ద మొత్తంలో కొంత భాగం ప్రభుత్వం అభివృద్ధికి ఉపయోగిస్తూ మరికొంత భాగం అమెరికా వంటి దేశాలకు బాండ్ల రూపంలో ఋణాలు అందజేస్తుంది. సోషల్ సెక్యూరిటీ పేరుతో కుటుంబాలు ప్రభుత్వ జోక్యం లేకుండా కోట్ల మందికి ఆలంబనగా ఉండటం ఎంతగొప్ప విషయం! ఈ కుటుంబాలను ప్రభుత్వాలు తమ శాసనాలతో రూపొందిచలేవు.

* అనేక కమ్యూనిటేరియన్ లక్షణాలు కలిగిన పరిశ్రమలు, వ్యాపారాలు ఈ దేశంలో అభివృద్ధిని సాధించాయి. లూధియానా, బటాలా, జలంధర్, ఆగ్రా, రాజ్‌కోట్, జామ్‌నగర్, మోర్వి, సూరత్, తిరుపూర్, కోయంబత్తూర్, శివకాశి మొదలైనవి వేలాది మందికి ఉపాధిని ఇవ్వటమే కాకుండా నైపుణ్యం మరియు నాణ్యతతో కూడిన వస్తువులను ఉత్పత్తి చేసి, కోట్ల రూపాయలు విదేశీమారక ద్రవ్యాన్ని ఆర్జించి పెడుతున్నాయి. ప్రభుత్వ ప్రమేయంలేని ఇటువంటి స్వావలంబిత వ్యవస్థలు ఈ దేశంలో 370 వరకు ఉన్నట్లు సర్వే ద్వారా తెలుస్తున్నది.

* ఈ దేశం పైకి శత్రువులు దండెత్తి వచ్చినపుడు కుటుంబాలు, కమ్యూనిటీలు సంఘటితమై ఎదుర్కొని సమాజాన్ని రక్షించుకున్నాయి.

* కేరళలో ఎజవా కులం వెనుకబడిన వర్గంగా పేర్కొంటారు. కాని నారాయణగురు నేతృత్వంలో ఆ కమ్యూనిటీ ప్రజలు వ్యాపారంలో, గౌరవింపదగిన స్థానంలో ఉండగలిగారు. 75 సం॥ల వారి ప్రయత్నం రాజకీయంగా, సామాజికంగా వారిని ఉన్నతంగా నిలబెట్టింది.

* పటేల్, కచ్ (గుజరాత్‌లో) ప్రజలు, ఆగ్రాలో జాటవులు, కోయంబత్తూర్‌లో నాయుడులు, దక్షిణ తమిళనాడులో నిడార్లు మొదలైనవారు పరస్పర విశ్వాసం, పరస్పర సహకారంతో, క్రమశిక్షణతో ఉన్నతంగా ఎదిగారు. వీళ్ళంతా సాంప్రదాయ వైశ్యులు కాదు. టెక్నికల్, ఇంజనీరింగ్ నైపుణ్యం కలిగిన ప్రజలు వీరు.

* 6,50,000 గ్రామాలకు ఈ దేశంలో 12,500 పోలీస్ స్టేషన్‌లు ఉన్నాయి. అమెరికా కంటే 100 రెట్లు క్రైమ్‌రేట్ తక్కువ. ఇది కమ్యూనిటి ప్రజల పరస్పర విశ్వాసాలకు ప్రతీక.

* కార్పెంటర్ డిప్లొమో చేసిన విద్యావంతుల కంటే ఇప్పటికీ గృహాలు, కార్యాలయ భవనాల ఫర్నీచర్‌ను అత్యంత సుందరంగా చెక్కేది ఇంగ్లీష్ రాని వడ్రంగులే.

* ఆటోమొబైల్ ఇంజనీరింగ్ చేసి సర్టిఫికేట్ పొందిన వారికంటే 6,7 తరగతులు చదివిన మెకానిక్‌లు లక్షల వాహనాలను అసెంబుల్

(మిగతాది 10వ పేజీలో)

# జౌళి వస్త్రరంగం-స్వావలంబన

-భూపతిరాజు సాంబశివరాజు

వ్యవసాయం తర్వాత అధికంగా ప్రజలు జీవనోపాధికై ఆధారపడ్డ రంగం, జౌళి-వస్త్రరంగం; ముఖ్యంగా చేనేతరంగం. ఇది చాలా వైవిధ్యభరితమయినదేకాక సంక్లిష్టమైనది కూడా. ఒకప్పుడు కేవలం ప్రకృతి నుండి గ్రహించిన ముడిపదార్థాలపై ఆధారపడి చేతివృత్తులతో నడిచే వస్త్ర ఉత్పత్తులు ఈనాడు సాంకేతికంగా ఎంతగానో అభివృద్ధి చెందాయి. శ్రామిక ప్రజలు ధరించే అతిసాధారణ వస్త్రాలనుండి హైఫేషన్ దుస్తుల వరకు, విభిన్న శీతోష్ణ పరిస్థితుల్లో మానవ శరీరాలను సంరక్షిస్తూను, ప్రతి ఇంట సాధారణ అవసరాల నుండి ఆధునిక అలంకరణల కోసమూ విభిన్న, వినూత్న వస్త్రాల ఉపయోగం పెరుగుతూ వస్తోంది. ఈ రంగం ఎంత పురాతనమయినదో అంత ఆధునికమయినది. మానవుని మహోన్నత హస్తకళ నైపుణ్యంనుండి అత్యాధునిక, అతి వేగవంతమయిన వస్త్ర తయారీ యంత్ర విజ్ఞానాన్ని ఈ రంగం ఇముడ్చుకుని ఉంది. లోతుగా ఆలోచిస్తే ఈ రంగం ఓరకంగా వీటిమధ్యన ఒక సంధాన కర్తగా ఉంది.

ప్రధానంగా మన దేశంలో ఈ వస్త్ర పరిశ్రమ మూడు అంగాలుగా ఉత్పత్తులు నెరపుతోంది. 1) చేనేత 2) మర మగ్గాల నేత 3) ఆధునిక వేగవంతమయిన మగ్గాల నేత.

నేతకి కావలసిన నూలు ఇంచుమించు యాంత్రికంగా స్పిన్నింగ్ మిల్లులలోనే తయారవుతుంది. ఈ రంగంలో సింథటిక్ ఉత్పత్తులు, రసాయనిక పెట్రోలియం ఉత్పత్తుల పరిజ్ఞానం పెరిగి బహుళజాతి కంపెనీలు ఇటువంటి ఉత్పత్తులపై అంతర్జాతీయంగా పేటెంట్లు పొంది తమ గుప్పెట్లో పెట్టుకుని అటువంటి ఉత్పత్తులను తమ ధన, ప్రచార బలంతో వినిమయ ప్రపంచంలో విప్లవాత్మకమయిన మార్పులు తీసుకు వచ్చారు. గ్లోబల్ మార్కెట్లను వీటితో ముంచెత్తారు. పాలిష్టర్, రెయాన్, నైలాన్ ఇలా ఎన్నో రకాలయిన పేటెంట్ ఉత్పత్తులను సాధారణ ప్రజానీకానికి అందుబాటులోనికి తీసుకురావడమే గాక వాటిని సులువుగా ఉతికి, ఆరేసుకునే సౌలభ్యాన్ని, మన్నికను కూడా ప్రధానమైన అంశాలుగా ముందుకు తీసుకు వచ్చారు. చలి దేశాలలో ఉద్భవించిన ఈ ఉత్పత్తులు సామ్రాజ్యవాదం- అన్య మార్కెట్ల ఆక్రమణలో భాగంగా భారతదేశానికి కూడా అని రావడం, అంబానీలాంటి కొత్త దళారులు రిలయన్స్ వంటి సంస్థ ద్వారా వాటిని అన్నిరకాల అడ్డదారుల ద్వారా దేశీయ మార్కెట్లోనికి చొప్పించి చరిత్ర సృష్టించడం చాలా మందికి తెలిసిన విషయమే.

ఈ పరిణామం మొత్తం మొట్ట మొదటగా చేనేత రంగంపై పిడుగులా పడి దాని విచ్ఛిన్నానికి దారి తీసింది. అంతే గాక అంబానీ చేసిన ఇంకొక పని ఏమంటే అయితే పెద్ద పెద్ద మిల్లుల్లోను లేకుంటే చేనేత మగ్గాల మీద తయారవుతూ వస్తున్న ఉత్పత్తులను అసంఘటిత మర మగ్గాలను చొప్పించడం ద్వారా అంచెలంచెలుగా ఇటు చేనేత పరిశ్రమను అటు సంఘటిత రంగంలోని అనేక మిల్లులను దెబ్బ కొట్టకలిగింది. చేనేత రంగం నీరశించిపోగా సంఘటిత మిల్లులరంగం పునరాలోచనలో పడి అటు మూసి వెయ్యడమో లేక ఆధునీకరించుకుని పాలిష్టర్ ఉత్పత్తుల వైపు మళ్ళడమో జరిగింది.

ఇదిలా ఉండగా అమెరికా, యూరప్‌లలో కార్మికుల జీత భత్యాలు పెరిగి పోవడం మూలంగానూ, అక్కడి ప్రజల ఆలోచన సింథటిక్ ఉత్పత్తులవల్ల పర్యావరణానికి కలుగుతున్న హానిని గుర్తించి వాటిని నిలవరించడంపై దృష్టి సారించడం మూలంగానూ, తాము ధరించే దుస్తుల్లో ప్రకృతి సహజమయినవయితే తమ శరీర రక్షణ బాగుంటుందనే అవగాహన పెరగడం మూలంగా వారి అభిరుచులలో మార్పులు రావడం మూలంగాను, అక్కడి వ్యాపారులు తమ మిల్లులను మూతబెట్టి మూడవ ప్రపంచ దేశాలలో తమ మార్కెట్ అవసరాలకు తగిన వస్త్రాలు, దుస్తులు మొదలయినవి తయారు చేయించుకొని దిగుమతులు చేసుకోవడం అనే మార్గాన్ని ఎంచుకున్నారు. అది వారిని సంక్లిష్టతతో కూడిన ఉత్పత్తి నుండి, సామాజిక బాధ్యత నుండి విముక్తులను చేసి కాలరెత్తుకుని కారు చవకగా పేద దేశాల ప్రజలను, వనరులను ఉపయోగించి మరిన్ని లాభాల నార్జించే బాటలో నడిపించింది. ఈ పాలసీలో భాగంగా వారు తమ బంటుదేశాలయిన దక్షిణ కొరియా, తైవాన్, జపాన్‌లో మొదలు పెట్టి, ఇండియా, లాటిన్ అమెరికా, ఇంకా కొంతమేరకు ఆఫ్రికా ఖండంలో ఈ ఉత్పత్తుల కేంద్రాలను సృష్టించారు.

ఇండియా, చైనాలు సాంప్రదాయకంగా గట్టి పునాదికలిగి ఉండటం మూలంగాను, చైనాలో పూర్తిగాను, ఇండియాలో కొంతమేరకు ప్రభుత్వాలకు స్వాతంత్ర్యానంతర తొలిదశలో సొంత ఆలోచనలు ఉండటం మూలంగా ఈ దేశాల్లో వాటి చొరబాటుకు కొంత సమయం పట్టినా, ఈ రెండు దేశాల ప్రభుత్వాలు రాను రాను వాటి దళారీ తనాన్ని పెంచుకుంటూ పోవడంతో మార్గం సులభతరమయి మొత్తం జౌళి రంగంమంతా ఓ పెద్ద కుదుపుకు లోనయ్యింది. కేవలం దేశీయ మార్కెట్టు కోసమే చేసే ఉత్పత్తుల నుండి దూరమౌతూ విదేశీ మార్కెట్లకోసం ఉత్పత్తులు చేయడం ప్రధాన అంశంగా మారింది. ఇది ఒకింత విచ్ఛిన్నానికి, ఒకింత నూతన అవకాశాలకు దారితీసింది. ఇటువంటి ప్రస్తుత పరిస్థితిలో

స్వావలంబన అంటే చరఖాపట్టుకు నూలువడకడం, చేనేత సర్వత్రా కావాలనుకోవడం భ్రమ-భ్రాంతి ఔతుంది.

ఇపుడున్న వైవిధ్యభరితమయిన, విస్తృతమయిన దేశీయ, అంతర్జాతీయ మార్కెట్ల అవసరాలు, మారుతున్న ప్రజల అభీష్టాలను దృష్టిలో పెట్టుకుని సమగ్రమయిన, సంపూర్ణమయిన వ్యూహరచన అవసరం ఎంతయినా ఉంది. క్లుప్తంగా చెప్పాలంటే వ్యవసాయ ఉత్పత్తులయిన పత్తి, జనుము మొదలయిన పంటల దగ్గర ఇది మొదలవ్వాలి. ఏ ఏ భూములతో ఏ ఏ రకమయిన విత్తనాలు రైతులను నష్టాలకు గురి చెయ్యకుండా ఉంటాయో అటువంటి విత్తనాలను దేశీయంగానే ఒనకూర్చుకోవడం స్వావలంబనకు మొదటి మెట్టు.

ఇటువంటి ఉత్పత్తులను చేనేతకు కావలసిన నూలు, పవర్‌లూమ్‌లకు కావలసిన హైస్పీడ్ లూమ్‌లకు కావలసిన వెరైటీ గ్రేడేషన్ చేసి నూలు ఉత్పత్తులను ఆయా రంగాలకు అందుబాటులోనికి తీసుకురావడం అన్నది ముఖ్యంగా జరగాలి. నూలు ఉత్పత్తి రంగం మన దేశంలో చాలా అభివృద్ధి చెందినప్పటికి వ్యత్యాసాలు ఎక్కువగానే ఉన్నాయి. దేశీయ, విదేశీ మార్కెట్ల అవసరాలకనుగుణంగా వివిధ రకాల వస్త్ర ఉత్పత్తులకు కావలసిన నూలు, రంగులు, అద్దకం సెంటర్లను ఒక క్రమ పద్ధతిలో చేనేత, పవర్‌లూమ్ రంగాల వారికి అందుబాటులోనికి తీసుకురావాలి.

పెద్ద పారిశ్రామిక వేత్తలు, ప్రభుత్వాలు ఇటువంటి హైటెక్ రంగాలలో కేంద్రీకరించి వైవిధ్యభరితమయిన అన్ని ఉత్పత్తులను వికేంద్రీకరించి, సేకరించి జాతీయంగా, అంతర్జాతీయంగా విక్రయించాలి. సహకార రంగాన్ని పూర్తిగా తిరగదోడి ఓ నూతన విధానాన్ని రచించాలి. ఎవరయితే శ్రమించి ఉత్పత్తి చేస్తారో వారికే వారి శ్రమ ఫలితం పూర్తిగా అందేటట్లు; దళారీ వ్యవస్థ రద్దయేటట్టు చెయ్యాలి. ఇది చాలా క్లిష్టమయిన వ్యవహారం కాబట్టి ఇటువంటి పనులు, సర్వీసు చేసే వారికి నిర్ణీత మయిన కమీషన్ ప్రభుత్వమే నిర్ణయించి, ప్రజా సంఘాలు వాటిని నియంత్రించే పద్ధతి తీసుకురావాలి.

అంటే చేనేత, పవర్‌లూమ్, మిల్ రంగాలను ఓ విస్తృతమయిన ప్రణాళికలో భాగస్వాములను చెయ్యాలి. ఒకరిని ఒకరికి పోటీ పెట్టి ఒకరి గొంతు ఒకరు నులుముకునే ఆటవిక వ్యవస్థ నుండి ఈ మొత్తం రంగాన్ని విముక్తి చేసే దిశగా అడుగులు వేయడం మొదలు పెడితే స్వావలంబన అనేది సాధ్యమవుతుంది. అన్ని రంగాలు నిత్య నూతనంగా అభివృద్ధి చెందడమే గాక వాటిపై ఆధారపడ్డ విస్తృత జనాభాకు ఆదాయాలు పెరిగి దాని మూలంగా దేశ ఆర్థిక పరిస్థితి మెరుగవుతుంది. అలా కాకుండా కంటి తుడుపుగా చేనేత రంగానికి గాని, పవర్ లూమ్స్‌కు గాని, చిన్న చిన్న మార్పులు చేయడానికే పరిమితమైతే అభివృద్ధి జరగకపోవడమే కాక అన్ని రంగాలు కుంటు పడిపోయే ప్రమాదం కూడా ఉంది.



(8వ పేజీ తరువాయి)

* జి.డి.పి. పెరుగుదల రేటు నిజమైన అభివృద్ధికి సంకేతం కాదు. ఉదా॥ నేరాలు పెరిగితే పోలీసుస్టేషన్ల సంఖ్య పెరగటం, జైళ్ళు, జైలు సిబ్బంది, ఆయుధాలు పోలీసు అధికారుల సంఖ్య ఈ విధంగా పెరగటం స్థూలరాష్ట్రాదాయం పెరుగుదల ఎలా అవుతుంది? ఇది నేరపూరిత సమాజంగా పరివర్తన చెందుతున్నట్లు కాదా?

* వడ్రంగులు, జౌసతి వాళ్ళు దుబాయ్, మస్కట్‌లకు వెళ్ళిన కారణంగా ఈ దేశం విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదిస్తున్నది.

* చక్కని డిజైన్లతో వస్త్రాలను నేసిన కార్మికులు, ఎగుమతులకు అవసరమయ్యే వ్యవసాయ ఉత్పత్తులను గావించే రైతులు మొదలైన ఇంగ్లీషు రాని నైపుణ్యం గల భారతీయులు ఈ ధేశంలో కోట్లమంది ఉన్నారు.

జపాన్ ఇటువంటి వారిని గుర్తించి అభివృద్ధి చెందింది. భారత్ ఆ పని చేయలేకపోయింది. అందుకే పరాధీన స్థితిలో ఉంది.

* భారతీయ రైతులు విత్తనాల్ని, ఎరువులను, పురుగు మందులను స్వయంగా తయారు చేస్తున్నంత కాలం ఆత్మ విశ్వాసంతో నిలబడగలిగారు. ఈ మూడింటికోసం ప్రభుత్వంపై ముఖ్యంగా విదేశీ బహుళజాతి కంపెనీలపై ఆధారపడి రైతులు నేడు అప్పుల పాలవుతున్నారు. ఆత్మ హత్యలకు పాల్పడుతున్నారు. భారతదేశపు ధాన్యాగారంగా ప్రసిద్ధికెక్కిన పంజాబ్‌లోని భటిండా జిల్లాలో ఈ మధ్య ఒక రెండు గ్రామాల్లో "ఈ ఊరు అమ్మబడును" అని బోర్డులు వ్రేలాడదీసి ఉన్నాయి. రైతుకుటుంబాలు లక్షల రూ॥ల అప్పులతో సతమతమౌతున్నాయి. విదేశీ విధానాలను గ్రుడ్డిగా అనుకరిస్తున్నందువల్ల ఈ దుష్పరిణామాలు సంభవిస్తున్నాయి. అందువల్ల సేంద్రియ వ్యవసాయం వైపు మళ్ళీ రైతులను మరల్చాల్సిన అవసరముంది.

కుటుంబాలు కమ్యూనిటేరియన్ లక్షణాలు కలిగిన పరిశ్రమలను, వ్యాపారాలను గుర్తించి ప్రభుత్వం ప్రోత్సహించాలి. ప్రజలు స్థానీయ ఉత్పత్తులను వినియోగించే దిశలో మేల్కొల్పాలి. ఎటువంటి విదేశీ ఆర్థిక సహాయం లేకుండా భారత్ జీవించగలదని, విదేశీ పెట్టుబడుల కోసం బిచ్చమెత్తవలసిన అవసరం లేదని, పాలకులు తెలుసుకోవాలి. పేదదేశం, నిరక్షరాస్యుల దేశం, బలహీన దేశం అనే బ్రాండ్ నుండి సూపర్ పవర్ భారత్‌గా రూపొందవలసిన అవసరం ఉందని పాలకులు, ప్రజలు గుర్తించాలి. అటువంటి స్వావలంబిత భారతదేశం కేవలం స్వప్నం కాదు. నిజంగానే తీర్చిదిద్దగలమన్న సంకల్ప బలం అందరికీ ఉండాలన్నదే మన ఆశయం.



# నిత్య జీవితంలో స్వావలంబన

-ఎన్. వేణుగోపాల్

(ఈ కింది వ్యాసపరంపర ఇదే పత్రిక గత ఏడాదిలో ప్రచురింపబడ్డాయి. స్వావలంబన ఫోకస్‌గా ఈ సంచిక తీసుకుని రావటం జరుగుతూంది కాబట్టి, పాఠకుల సౌకర్యార్థం వాటిని ఇక్కడ పునర్ముద్రిస్తున్నాం-సం)

భారతదేశంలో దాదాపు 150 బహుళజాతి సంస్థల శాఖలో, భాగస్వామ్య సంస్థలో ఉన్నాయని ఒక అంచనా. ఈ బహుళజాతి సంస్థల వార్షిక ఆదాయం భారత జాతీయ ఆదాయం కన్నా 20 రెట్లు ఎక్కువ.

ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలతో పోల్చి చూసినపుడు బహుళజాతి సంస్థలు ఇంత బలోపేతమయినవి కనుక ఆయా దేశాల ప్రభుత్వాలకు, బహుళజాతి సంస్థలకూ మధ్య సంబంధం సమానంగా ఉండడం సాధ్యం కాదు. బహుళజాతి సంస్థలు ప్రవేశించినపుడు కేవలం ఆ దేశంలోని ఖనిజ వనరులను, ముడిసరుకులను తీసుకుపోవడానికి, ఆ మార్కెట్లలో తమ సరుకులు అమ్ముకోవడానికి అంటే కేవలం వ్యాపార ప్రయోజనాల కోసమే ప్రవేశించవచ్చు. కానీ తమ బలం వల్ల, సంపద నుంచి వచ్చే అహంకారం వల్ల ఆ ప్రభుత్వాలను లొంగదీయడం ప్రారంభిస్తాయి. తమకు ముడిసరుకులు అందడానికి ఉన్న ఆటంకాలన్నింటినీ తొలగించమని ఆదేశిస్తాయి. తమ మార్కెట్లు విస్తరించుకోవడానికి ఇతోధిక అవకాశాలు కల్పించమని ఆదేశిస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే స్థానిక ప్రభుత్వపు రాజకీయార్థిక విధానాలను తామే నిర్దేశిస్తాయి.

ప్రపంచీకరణ, సరళీకరణ అనే పదాలకు స్థూలమైన అర్థం ఇదే! పేద దేశాలు తమ ముడిసరుకులను, తమ మార్కెట్లను ప్రపంచీకరించాలి. ఆ ప్రపంచీకరణకు ఆటంకాలుగా ఉన్న స్థానిక పరిరక్షణ చట్టాలను, ఆంక్షలను, ఆచారాలను సరళీకరించాలి.

ఈ పని జరిగిన తరువాత మార్కెట్లలోకి బహుళజాతి సంస్థల సరుకులు ఇబ్బడి ముబ్బడిగా దిగుమతి అవుతాయి. అవసరం ఉన్నా లేకపోయినా సరుకులను వాడే వినియోగదారీ సంస్కృతి వ్యాపిస్తుంది. ప్రకటనలతో, ప్రోత్సాహకాలతో, ఆకర్షణలతో, బెదిరింపులతో కొత్త సరుకులను మప్పడం మొదలవుతుంది. ఒక దశాబ్దం వెనకకూ ఇప్పటికీ మన వ్యక్తిగత జీవితంలోకి ఎన్ని కొత్త సరుకులు ప్రవేశించాయో, వాటిలో నిజంగా అవసరం కొద్దీ వచ్చినవెన్నో, అవసరం లేకపోయినా ప్రచార ఆర్భాటం వలన, సామాజిక కార్యక్రమాల వలన వచ్చినవెన్నో సమీక్షించుకుంటే సరుకు జీవితం లోకి ఎంత చొచ్చుకువచ్చిందో అర్థం అవుతుంది. ఈ చొచ్చుకు వచ్చిన సరుకుల్లో 90 శాతం పైన బహుళజాతి సంస్థల ఉత్పత్తులే.

ఈ బహుళజాతి సంస్థల ఉత్పత్తుల వినియోగానికి ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక కోణాలెన్నో ఉన్నాయి. ఆ సరుకులు మన ఉపయోగం కోసమో, మన సౌకర్యం కోసమో, విలాసం కోసమో వచ్చినట్లు పైకి కనపడవచ్చు కానీ వాస్తవంగా వాటి వినియోగం వలన మనం పొందే ప్రయోజనం కన్నా మనం వాటిని వినియోగించటం వలన బహుళజాతి సంస్థలు పొందే ప్రయోజనం ఎక్కువ.

మనం నిత్యజీవితంలో వాడుతున్న వస్తువులను ఒకటొకటిగా తీసుకుని వాటిని, వాటి వెనుక రాజకీయార్థిక ప్రయోజనాలను వివరించడం ఈ శీర్షిక లక్ష్యం. వరుసగా ఆయా సరుకులను వాటి మార్కెట్లను వాటి ఉత్పత్తిదారులను వివరించి వాటికి ప్రత్యామ్నాయాలను సూచించడం జరుగుతుంది. బహుళజాతి సంస్థలమీద పోరాటం స్థూలస్థాయిలో కూడా అంతగానే జరగవలసి ఉందనే గుర్తింపును కలిగించడం కోసమే ఈ వ్యాస పరంపర.

## స్వావలంబన-2

మన దైనందిన జీవితంలో ఇవాళ బహుళజాతి సంస్థలు ప్రవేశించని చోటు, విస్తరించని సమయం లేదని పైన స్థూలంగా చెప్పుకున్నాం. ఈ చొరబాటును ఇంకా వివరంగా సూక్ష్మస్థాయిలో అర్థం చేసుకోవాలంటే అటు బహుళజాతి సంస్థల కార్యక్షేత్రాల వైపు నుంచి గాని, ఇటు మన జీవన కార్యకలాపాలతో మనం వాడుతున్న సరుకుల వైపునుంచి గాని, సేవల వైపునుంచి గాని వర్గీకరించి అర్థం చేసుకోవలసి వుంటుంది. సబ్బులు, టూత్ పేస్టుల తయారీ నుంచి విమానాలు, విద్యుదుత్పత్తి పరికరాల దాకా బహుళజాతి సంస్థలు తయారుచేసే సరుకులు ఎన్నో ఉన్నాయి. బ్యాంకింగ్, రవాణా సేవల నుంచి ప్రభుత్వాలకు సలహాలిచ్చే దాకా బహుళజాతి సంస్థలు మూడో ప్రపంచ దేశాలకు అమ్ముతున్న సేవలు ఎన్నో ఉన్నాయి. అంటే మనం నేరుగా ఏ ఒక్క బహుళజాతి సంస్థ సరుకునూ, సేవనూ ఉపయోగించగూడదని అనుకున్నా, పరోక్షంగా ఏదో ఒక బహుళజాతి సంస్థ సరుకునూ, సేవనూ ఉపయోగించక తప్పని స్థితి ఉంది.

నిత్యజీవితంలో బహుళజాతి సంస్థల చొరబాటును పరిశీలించదానికి భారీ యంత్ర పరికరాలతో, సేవారంగంలో, వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగ్, మారుబేరాలలో, వినియోగ వస్తువులలో వాటి ప్రవేశాన్ని, వాటి ప్రయోజనాలను అధ్యయనం

చేయవలసి వుంటుంది. నిజానికి ఈ నాలుగు రంగాలలోను భారతదేశం వంటి విస్తృతమైన సహజ వనరులు, మానవ శ్రమశక్తి ఉన్న దేశం బహుళజాతి సంస్థల మీద ఆధారపడనక్కరలేదు. భారత పరిశ్రమ, సాంకేతిక పరిజ్ఞాన స్థాయి ఉత్పత్తి చేయలేని భారీ యంత్ర సామాగ్రి ఏమీలేదు. సేవా రంగంలో నిజంగా భారత ప్రజలకు అవసరమైన సేవలేవో సమీక్షించుకొని సరైన విధానాలను అవలంభిస్తే సేవల స్వావలంబన సాధించవచ్చు. వ్యవసాయోత్పత్తులలో భారతదేశం సాధించిన స్వయం సమృద్ధిని పాలకులే చేజేతులా విధ్వంసం చేసి, వ్యవసాయ రంగాన్ని బహుళజాతి సంస్థల చేతికి అప్పగించారు. ఇక వినియోగ వస్తువులలో ఆడంబరానికి పోకుండా, తక్షణావసరాలు తీర్చే ప్రాతిపదికపై ఒక సమగ్ర విధానాన్ని గనుక రూపొందించగలిగితే దేశ ప్రజలకు అవసరమైన వినియోగ వస్తువులను స్వయం శక్తితో తయారుచేసుకోవడం సాధ్యమే.

కాని ఈ నాలుగు రంగాలలోనూ బలసంపన్నమైన బహుళ జాతి సంస్థలు భారత పాలకుల మెడలు వంచి, మరీ ముఖ్యంగా 1991 నూతన ఆర్థిక విధానాల తర్వాత, దేశంలోకి విస్తరించి ఊడల మర్రిలా పాకిపోయాయి.

ఈ పైనుంచి బహుళజాతి సంస్థల చొరబాటు చిత్రానికి, కిందినుండి ప్రజలలో తయారైన సమ్మతిని కలపకపోతే దృశ్యం పూర్తికాదు. కిందినుంచి, ముఖ్యంగా మధ్యతరగతిలో బహుళజాతి సంస్థల ప్రవేశానికి అనుకూలమైన, ఆహ్వానించే భావాలను ప్రవేశ పెట్టడం, పదేపదే ప్రచారం చేసి గత్యంతరంలేదనే అభిప్రాయం కలిగించడం క్రమబద్ధంగా, ప్రణాళిక ప్రకారం జరిగింది.

అందులోనూ భారీ యంత్ర సామాగ్రి, స్థూల ఆర్థిక వ్యవస్థస్థాయి సలహాల రంగంలో విడివిడిగా ప్రజలకు నిర్ణయాధికారం ఏమీలేదు. ఆ స్థాయిలో నిర్ణయాధికారం అటు ప్రభుత్వాలకు గాని, బడా పారిశ్రామికవేత్తలకు గాని మాత్రమే ఉంటుంది. అంతిమ ఫలితాలు ప్రజల నిత్య జీవితం మీద ఉన్నప్పటికీ ఈ స్థాయిలో ఫలానా నిర్ణయం తీసుకోమని గాని, వద్దనిగాని చెప్పడానికి తగిన సమాచారం ప్రజలకు అందుబాటులో లేదు. చెప్పే అవకాశమూ లేదు. ఇక మిగిలిన నిత్యం వాడుకునే వినియోగ సరుకులు, సేవలు, వ్యవసాయోత్పత్తులు. ఇవి మన మార్కెట్లలోకి ఎంతగా విస్తరించాయంటే కొన్ని రంగాలలో మార్కెట్లో పోటీపడేవీ, దొరికేవీ అన్నీ బహుళజాతి సంస్థల ఉత్పత్తులే. వినియోగదారు వాటిలోనే ఏదో ఒకదాన్ని ఎంచుకోవలసిన పరిస్థితి ఉంది.

వీటిలో వినియోగదారీ సరుకుల దగ్గర మన పరిశీలన మొదలు పెడదాం.

బహుళజాతి సంస్థల, వ్యాపారస్తుల మార్కెట్ పరిభాషలో వీటిని వేగంగా అమ్ముడయ్యే వినియోగ వస్తువులు (ఫాస్ట్ మూవింగ్ కన్స్యూమర్ గూడ్స్-ఎఫ్.ఎం.సి.జి) అంటారు. ఎక్కువకాలం నిలువ వుండని, రోజువారీ అవసరానికి ఉపయోగపడే సరుకులన్నీ ఈ వర్గీకరణ కిందికి వస్తాయి. వ్యాపారస్తుల, ఉత్పత్తిదార్ల నిర్వచనం ప్రకారం ఈ సరుకులను ప్రతి వినియోగదారు సగటున నెలకొకటైనా కొంటారు.

అంటే భారత జనాభాలో కనీసం మధ్యతరగతినే లెక్కవేసుకున్నా ముప్ఫై కోట్లమంది ఉన్నారనుకుంటే, సరుకుల వినియోగం కూడా మనుషుల లెక్కన కాక కుటుంబం లెక్కన వేసుకున్నా, ప్రతినెలా ఈ సరుకులు కనీసం ఆరు కోట్లు అమ్ముడవుతాయనుకోవాలి. ఇది కనీస పక్షం అంచనా. నిజానికి ఈ వినియోగ సరుకులకు మధ్య తరగతి లోనే కాక ఇతర వర్గాలలో కూడా మార్కెట్ ఉంది గనుక ఇది కొన్నివేల కోట్ల రూపాయల మార్కెట్.

ఈ ఎఫ్.ఎం.సి.జి. రంగంలో బట్టలు ఉతికే సబ్బులు, పౌడర్లు వంటి సబ్బులు, టూత్ పేస్టులు, టూత్ పౌడర్లు, బ్రష్‌లు, షాంపూలు, క్రీములు, పౌడర్లు, ఆహార పదార్థాలు, తీపి పదార్థాలు, పానీయాలు, సిగరెట్లు వంటి ఎన్నో సరుకులను లెక్కిస్తారు.

ఈ సరుకులకు వ్యాపార వర్గాలు, ఉత్పత్తిదార్లు ఆపాదిస్తున్న లక్షణాలను చూస్తే, వీటిలో బహుళజాతి సంస్థలు లేదా భారీ పెట్టుబడిదారులు మాత్రమే నిలదొక్కుకోవడానికి ఎటువంటి పరిస్థితులు కల్పించబడ్డాయో అర్థమవుతుంది.

ఈ సరుకులు విడివిడిగా, ఒక్కొక్కటిగా చూస్తే ఖరీదైనవి కావు. కాని ఒక వినియోగదారు మొత్తం ఖర్చులో ఈ సరుకుల వాటా చాలా ఎక్కువ. ఒక్కొక్క సరుకుమీద ఉత్పత్తిదారుకు గాని, వ్యాపారికి గాని వచ్చే లాభం ఎక్కువ కాకపోవచ్చు కాని ఆ సరుకుల వినియోగం విపరీతంగా ఉండడం వల్ల లాభాలు చాలా ఎక్కువగా ఉంటాయి.

ఈ సరుకులు కొనేటప్పుడు వినియోగదారులు పెద్దగా ఆలోచించరు. ఆ సరుకుల సాంకేతిక లక్షణాలేమిటనేది చూడరు. తెలిసిన బ్రాండ్‌నే పదేపదే కొంటూ ఉండడమో, ఎవరైనా చేసిన సిఫారసు ఆధారంగానో, ప్రకటన ఆకర్షణతోనో కొంటూ ఉండడమో చేస్తూ వుంటారు.

ఉత్పత్తిదార్లు, వ్యాపారస్తులు ఈ ఎఫ్.ఎం.సి.జి సరుకులకు ఆపాదించే మిగిలిన లక్షణాలు ఎలా ఉన్నా, ఈ రెండు లక్షణాలూ బహుళజాతి సంస్థలకు, భారీ పెట్టుబడిదారులకు ఈ రంగాన్ని చాలా ఆకర్షణీయమైన, అనువైన రంగంగా మారుస్తాయి. ఈ సరుకుల విషయంలో యూరప్, అమెరికా మార్కెట్లు ఇప్పటికే పూర్తయిపోవడం వల్ల, భారత మార్కెట్ చాలా పెద్దది కావడం మాత్రమే కాక, భారత మార్కెట్‌లో సగానికి పైగా ఇప్పటికీ స్థానిక, చిన్న ఉత్పత్తిదార్ల

సరుకులతో నిండిఉండడం వల్ల, ఈ మార్కెట్‌ను ఆక్రమించడానికి బహుళజాతి సంస్థలు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి.

అట్లాగే, వినియోగదారుల మనసుల్లో తమ బ్రాండ్ మాత్రమే నిలిచివుండేలా చూడ బంటే అన్ని ప్రచార, ప్రసార సాధనాల్లో విపరీతంగా వ్యాపార ప్రకటనలు ఇవ్వవలసి వుంటుంది. స్థానిక, చిన్న పెట్టుబడిదారుల కన్న బహుళజాతి సంస్థలు, భారీ పెట్టుబడిదారులు ఇటువంటి భారీ వ్యాపార ప్రకటనలు ఇవ్వగలరు. క్రమక్రమంగా మార్కెట్లను విస్తృతం చేసుకోగలరు.

అంతర్జాతీయంగా ఎఫ్.ఎం.సి.జి మార్కెట్లలో యూనిలివర్, ప్రోక్టర్ అండ్ గాంబిల్, కోల్గేట్, నెజిల్, హీంజ్, స్మిత్‌క్లైన్‌వంటి కొన్ని బహుళజాతి సంస్థలే అత్యధిక మార్కెట్ వాటాలతో రాజ్యం చేస్తున్నాయి. ఈ అన్ని బహుళజాతి సంస్థలు ప్రత్యక్షంగానో, మిలాఖత్తులతోనో భారత మార్కెట్‌లో కూడా సింహభాగాన్ని ఆక్రమించి ఉన్నాయి.

భారత మార్కెట్లలో బహుళజాతి సంస్థల ప్రవేశాన్ని 1947 తర్వాత కూడా ఆమోదించాలని భారత ప్రభుత్వం నిర్ణయించుకుంది. అప్పటికి హిందూస్తాన్ లివర్ (యునిలివర్ మిలాఖత్తు సంస్థ)కు మాత్రం భారతదేశంలో ఉత్పత్తి కేంద్రాలు ఉండేవి. కోల్గేట్, నెజిల్‌లకు వ్యాపారం మాత్రం ఉండేది. 1960లలో ఎన్నో బహుళజాతి సంస్థలు భారత మార్కెట్లో ప్రవేశించి ఉత్పత్తి కేంద్రాలను ఏర్పాటు చేశాయి. అప్పటి చట్టాలు స్వావలంబన విధానం పునాదిగా ఈ బహుళజాతి సంస్థల ప్రవేశం మీద, వ్యాపారం మీద ఆంక్షలు విధించాయి. 1978లో జనతాపార్టీ ప్రభుత్వం బహుళజాతి సంస్థలు భారతీయ ఉత్పత్తి కేంద్రాలలో వాటాను 40 శాతానికన్నా తగ్గించుకోవాలని లేదా దేశం వదలిపోవాలని ఆదేశించింది. ఐ.బి.ఎం., కోకాకోలా వంటి కంపెనీలు దేశం వదలి వెళ్ళిపోగా, హిందూస్తాన్ లివర్ ఆంక్షలకు లోబడి కొనసాగింది.

నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ ప్రారంభమైన 1991 తర్వాత (నిజానికి 1985 రాజీవ్‌గాంధీ దిగుమతుల సడలింపు నుంచే) భారత ప్రభుత్వం బహుళజాతి సంస్థలకు ఆహ్వానాలు పలకడం, వాటి విస్తరణకు అనుకూలమైన పరిస్థితులు కల్పించడం ప్రారంభించింది. ముఖ్యంగా ఎఫ్.ఎం.సి.జి రంగంలో అప్పటి వరకూ దిగుమతులను నిరుత్సాహపరచడానికి అమలులో ఉండిన భారీ ఎక్సైజ్ డ్యూటీలకు విపరీతంగా తగ్గించడం ప్రారంభించింది.

బట్టలు ఉతికే సబ్బుల మీద పౌడర్లమీద ఎక్సైజ్ సుంకాన్ని 1993-94లోని 35 శాతం 1998-99 నాటికి 16 శాతం తగ్గించింది. ఈ తగ్గుదల సబ్బులలో 20 శాతం నుంచి 16 శాతానికి, టూత్ పేస్టులలో 20 శాతం నుంచి 8 శాతానికి, కాస్మెటిక్స్‌లో 120 శాతం నుంచి 30 శాతానికి తగ్గించటం జరిగింది.

అప్పటివరకూ ఎఫ్.ఎం.సి.జి రంగంలో ఉండిన లైసెన్సింగ్ నిబంధనలను కూడా సులభతరం చేసి, స్థానిక అసంఘటిత ఉత్పత్తిదార్ల మార్కెట్లను బహుళజాతి సంస్థలు కొల్లగొట్టేందుకు రంగం సిద్ధం చేసింది. గ్రామీణ మార్కెట్లలోకి కూడ బహుళజాతి సంస్థలు సులభంగా చొరబడేందుకు వీలుగా ప్రపంచ బ్యాంకు, ఆసియా అభివృద్ధి బ్యాంకు, జపాన్ ఒ.ఇ.సి.ఎఫ్. వంటి సంస్థల నిధులతో పెద్ద ఎత్తున రోడ్ల నిర్మాణ కార్యక్రమాలు చేపట్టింది.

ఇప్పటికీ ఎఫ్.ఎం.సి.జి రంగంలో బహుళజాతి సంస్థల ప్రవేశానికి కొన్ని ఆటంకాలున్నాయని, వాటిని తొలగించమని బహుళజాతి సంస్థలు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు భారత ప్రభుత్వం మీద, రాష్ట్ర ప్రభుత్వాల మీద ఒత్తిడి తెస్తున్నాయి. ప్రజల ఆదాయ స్థితి తక్కువ స్థాయిలో ఉండడం వల్ల కొనుగోలు శక్తి లేదని, అందువల్ల ప్రభుత్వ కార్యక్రమాలు నేరుగా బహుళజాతి సంస్థల సరుకుల పంపిణీకి సహకరించాలని, మార్కెట్లను అభివృద్ధి చేయాలని, తక్కువ ఉత్పత్తి వ్యయంతో తక్కువ ధరలకు అమ్ముతూ తమకు పోటీగా నిలుస్తున్న స్థానిక ఉత్పత్తిదారులను నాణ్యత పేరుతో కట్టడి చేయాలని బహుళజాతి సంస్థలు కోరుతున్నాయి. దేశంలో మొత్తం యాభై లక్షలకు పైగా చిల్లర దుకాణాలు ఉన్నాయని, ఇంత పెద్ద సంఖ్యలో దుకాణాలు ఉండడం పంపిణీ వ్యవస్థను సంఘటితం చేయడానికి ఆటంకమని, అందువల్ల భారీ సూపర్ మార్కెట్లను ప్రోత్సహించే విధానాలు చేపట్టమని బహుళజాతి సంస్థలు కోరుతున్నాయి. కోల్డ్ స్టోరేజీలు, మంచిరోడ్లు వంటి సాధన సంపత్తి కల్పించడం ద్వారా మార్కెట్లను ఆధునికీకరించాలని కోరుతున్నాయి.

ఈ ఒత్తిడులకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పటికే తల ఒగ్గుతున్నాయి. అందువల్ల గత పది సంవత్సరాలలో మన మార్కెట్లలో ఎన్నో గణనీయమైన మార్పులు జరిగిపోయాయి. కొత్త కొత్త సరుకులు, మార్కెటింగ్ పద్ధతులు, పంపిణీ పద్ధతులు, సూపర్ మార్కెట్లు, గ్రామీణ మార్కెట్లలో కూడా బ్రాండెడ్ సరుకులు ప్రవేశించాయి. స్థానిక పారిశ్రామిక కేంద్రాలలో చిన్న స్థాయిలో సబ్బులు, పెన్నులు, టూత్‌పౌడర్లు, బ్రష్‌లు తయారుచేసి చిన్న పట్టణాలలో, గ్రామీణ మార్కెట్లలో అమ్ముకునే చిన్న తరహా పారిశ్రామిక సంస్థలు కుప్పకూలిపోయాయి. ఆ సంస్థల కార్మికులు వీధుల్లో పడ్డారు. బహుళజాతి సంస్థల సరుకులు ఎంతటి విశ్వరూపం ప్రదర్శిస్తున్నాయంటే టూత్‌పేస్ట్, పౌడర్, బ్రష్‌ల మార్కెట్‌లో సంఘటిత రంగంలో 85 శాతం అమ్మకాలను కేవలం రెండే బహుళజాతి సంస్థలు-కోల్గేట్, హిందూస్తాన్ లివర్ శాసిస్తున్నాయి.

కోవడం, అన్ని ప్రచార, ప్రసార సాధనాలలో ఆర్భాటంగా, ఆకర్షణీయంగా తమ సరుకుల గురించి ఊదరగొట్టడం సాగిస్తున్నాయి. స్థానిక పరిశ్రమలను దెబ్బతీయడానికి, ప్రజల మామూలు అలవాట్లను తప్పుపట్టి వాళ్ళను మార్కెటేతర సహజ పదార్థాల వినియోగం నుంచి, తమ సరుకుల వినియోగంలోకి మార్చడానికి బహుళజాతి సంస్థలు ప్రయత్నిస్తున్నాయి.

దేశంలో ఐదులక్షల టన్నులైనా ఉండవలసిన దంత ధావన పదార్థాల వినియోగంలో సంఘటిత మార్కెట్‌లో లక్ష టన్నుల వినియోగమే ఉందని మార్కెట్ సర్వేలు తెలుపుతున్నాయి. మిగిలిన వినియోగం అసంఘటిత రంగంలో ఉండవచ్చు. ఈ మార్కెట్ సర్వేల పరిభాషలో సంఘటిత మార్కెట్ అంటే బహుళజాతి సంస్థలు, దేశ వ్యాప్త గుత్త సంస్థలు. అసంఘటిత మార్కెట్ అంటే స్థానిక, చిన్న పారిశ్రామిక సంస్థలు.

మార్కెట్ సర్వేలు ప్రకారం సంఘటిత రంగంలోని పారిశ్రామిక సంస్థలు ఏడు: అవి:-కోల్గేట్ పామోలివ్ ఇండియా లిమిటెడ్, హిందుస్తాన్ లివర్ లిమిటెడ్, బల్సారా హైజీన్ లిమిటెడ్, డాబర్ ఇండియా లిమిటెడ్, స్మిత్‌క్లైన్ బీచమ్ కన్స్యూమర్ హెల్త్‌కేర్, అంకర్ హెల్త్ అండ్ బ్యూటీ ప్రొడక్ట్స్, వికో లాబొరేటరీస్, ఇవికాక జెఫ్రీ మానర్స్, హిందుస్తాన్ సీబా-గెయిగి వంటి మరికొన్ని సంస్థలు కూడా ఉన్నాయి.

సంఘటిత రంగంలోని టూత్‌పేస్ట్ మార్కెట్‌లో 85 శాతం మొదటి రెండు సంస్థలు కోల్గేట్ పామోలివ్, హిందూస్తాన్ లివర్ గుప్పిట్లోనే వుంది. ఈ రెండు సంస్థలూ బహుళజాతి సంస్థలే. సంఘటిత రంగంలోని టూత్‌పౌడర్ మార్కెట్లో 75 శాతం కోల్గేట్, డాబర్ సంస్థల చేతుల్లోనే ఉంది. వీటిలో డాబర్ స్వదేశీ సంస్థే అయినప్పటికీ సాంకేతిక విధానం కోసం, పంపిణీ కోసం బహుళజాతి సంస్థలతో మిలాఖత్తు కావడానికి ఉవ్విళ్ళూరుతోంది.

కోల్గేట్ పామోలివ్ ఈ మార్కెట్‌లో అగ్రభాగాన ఉంది గనుక దాని గురించి వివరంగా తెలుసుకోవడం అవసరం.

కోల్గేట్‌సంస్థను 1806లో అమెరికాలో ప్రారంభించారు. దాదాపు మొదటి వంద సంవత్సరాలు ఆ సంస్థ అమెరికాలో మాత్రమే వ్యాపారం చేసింది. గత శతాబ్దం తొలిరోజుల నుంచి విదేశీ వ్యాపారాలు ప్రారంభించి, ఇవాళ రెండువందలకు పైగా దేశాలలో తన సరుకులు అమ్ముతోంది. కోల్గేట్, పామోలివ్, అజాక్స్, ఫాబ్, మెన్నెన్ లాంటి ఎన్నో ప్రపంచ వ్యాప్తమైన బ్రాండ్లతో, నోటి పరిశుభ్రతా సరుకుల మార్కెట్లోనే కాక ఇతర ఎఫ్.ఎమ్.సి.జి. మార్కెట్లలో కూడా అగ్రస్థానంలో వుంది. ఈ సంస్థ అమ్మకాల విలువ సాలీనా దాదాపు 50 వేల కోట్ల రూపాయలు.

ఈ సంస్థ భారతదేశంలో వ్యాపారాన్ని 1937లో, కోల్గేట్ డెంటల్ క్రీమ్ అనే టూత్‌పేస్ట్‌తో ప్రారంభించింది. అప్పుడు ఈ సంస్థ స్థాపక పెట్టుబడి రూ.1,50,000 మాత్రమే. ఈ పెట్టుబడికి గాను, ఎన్నోరెట్ల లాభాన్ని ఈ సంస్థ అమెరికాకు తరలించుకుపోయింది. 1975 నాటికి భారతదేశం నుంచి అమెరికా లాభాల వాటారూపంలోనే రూ. 5 కోట్లు తరలిపోయాయి. 1978లో జనతాపార్టీ ప్రభుత్వం మిగిలిన అన్ని బహుళజాతి సంస్థలమీద ఆంక్షలు విధించినట్టుగానే, కాల్గేట్ మీద కూడా ఆంక్షలు విధించింది. విదేశీ వాటాను 51 శాతం నుంచి 40 శాతానికి తగ్గించుకొమ్మని కోరింది. మళ్ళీ 1993లో మాతృసంస్థ వాటా పెరగడానికి అనుమతి దొరికినప్పుడు జరిగిన లావాదేవీల్లో అమెరికాలోని బహుళజాతి సంస్థ రూ. 230 కోట్లు లాభం చేసుకుంది. కేవలం 1998-99లోనే కాల్గేట్ పామోలివ్ ఇండియా మొత్తం అమ్మకాలు రూ. 998 కోట్లు కాగా, లాభం రూ. 250 కోట్ల పైచిలుకు.

తాజా గణాంకాల ప్రకారం కోల్గేట్ పామోలివ్‌కు టూత్‌పేస్టుల మార్కెట్లో 52 శాతం, టూత్‌పౌడర్ల మార్కెట్లో 48 శాతం, టూత్ బ్రష్‌ల మార్కెట్లో 36 శాతం వాటా ఉంది. అంటే ప్రతి రెండో మనిషి వాడే టూత్‌పేస్టు వల్ల, టూత్‌పౌడర్ వల్ల, ప్రతి మూడో మనిషి వాడే టూత్‌బ్రష్ వల్ల ఆ మనుషుల నోటి ఆరోగ్యాలు బాగుపడుతున్నాయో లేదో తెలియదుగాని, కాల్గేట్ పామోలివ్ కంపెనీకి అదనపు లాభాలు చేకూరుతున్నాయి.

కోల్గేట్ పామోలివ్‌కు దంత ధావన పదార్థాలతో పాటు వంటి సబ్బులు, షాంపూలు, చర్మపు క్రీములు, షేవింగ్ క్రీములు, ఆఫ్టర్ షేవ్ లోషన్లు, పాత్రలు కడిగే పేస్టులు వంటి ఇతర వ్యాపారాలు కూడా ఉన్నాయి.



## స్వదేశీ బిస్కట్లదే పై చేయి

స్వదేశీ ప్రియులకు ఓ సంతోషకరమైన వార్త. మన ఇళ్ళల్లో బిస్కట్లు, కేకులు, బ్రెడ్ ఏం తిన్నా అవి బ్రిటానియా బహుళజాతి సంస్థలే. కాని మనదేశానికి పరిమితమై చూస్తే మనదేశంలోని పార్లే కంపెనీ బిస్కట్లే 18 కోట్ల కిలోలు ఖర్చువుతున్నాయి. ఇలాగే ఇటలీ, ఆస్ట్రేలియా, చైనా, బ్రిటన్ దేశాల్లోని స్వదేశీకంపెనీల బిస్కట్లే ఎక్కువ డిమాండులో ఉన్నాయి. పార్లే బ్రాండు బిస్కత్తు అధికంగా అమ్ముడు పోవటానికి వాటిధర పేద మధ్యతరగతి వారికి అందుబాటులో వుండడమే. 60 సంవత్సరాల బట్టి దేశంలో తయారై అమ్ముడు పోవటంతో వినిమయదారులకు దగ్గరచుట్టమైంది. ఒక విశేషమేమంటే భారతీయులు అమెరికాతో పోల్చిచూస్తే బిస్కట్లు చాలా తకువగానే తింటారు. అమెరికాలో మనదేశంలోలాగ చిల్లర తిళ్ళు వుండవు కాబట్టి, బిస్కట్ వారికి ఆహారం. అందుచేతనే సంవత్సరానికి తలసరి వినిమయం నాలుగు కిలోలు, మనం అరకిలో కన్నా తక్కువే. ప్రపంచంలోని బిస్కత్ బ్రాండ్‌లలో పార్లే నెంబర్‌వన్ బ్రాండ్. దేశంలో ఇతర వినిమయ వస్తువులు తయారుచేసే మీసం మెలేసిన కంపెనీలు 91లో సంస్కరణలు ప్రారంభించడంతోనే బహుళజాతి కంపెనీలకు పాదాక్రాంతమైపోగా, పార్లే పోటీని తట్టుకొని నిలబడింది. ఆ కంపెనీకివే జేజేలు.

# అటవీ భూములు ఆదివాసీల జన్మహక్కు

-అత్రం రామారావు

ప్రపంచీకరణలో భాగంగా అడవులతో సహ సహజ వనరులన్నింటినీ ప్రైవేటీకరించుటకు పాలకవర్గాలు పూనుకుంటున్నాయి. ఇందుకు మెట్టు మెట్టుగా ఒక పథకం ప్రకారం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పని చేస్తున్నాయి. అడవులను ప్రైవేటీకరించే దానిలో భాగంగానే ప్రపంచబ్యాంకు మార్గదర్శకత్వంలో రాష్ట్రంలో "సాముదాయక అటవీ యాజమాన్య పథకం" చేపట్టుట జరిగింది.

ఆదివాసులను ఉద్ధరించుట వారిని దారిద్ర్యం నుండి విముక్తులు చేయుట అటవీ రక్షణ పథకాలు ఒక ముఖ్య లక్ష్యంగా ప్రకటిస్తున్నారు. కానీ వాస్తవాలు అందుకు పూర్తి భిన్నంగా వున్నాయి. వీరికి జీవనాధారంగా వున్న భూముల నుండి పారద్రోలే కార్యక్రమం పథకం ప్రకారం పాలకవర్గాలు చేపట్టి కొనసాగిస్తున్నాయి. 1994లో ప్రారంభించిన "ఉమ్మడి అటవీ యాజమాన్య పథకం" ఆదివాసుల పాలిట వరంగా అరచేతిలో స్వర్గం చూపించారు. కానీ ఆచరణలో కనీనం పునరావానం కానీ, ప్రత్యామ్నాయ జీవనోపాధి చూపించకుండానే ఆదివాసుల భూములు స్వాధీనం చేసుకొనుట జరిగింది. ఉమ్మడి అటవీ యాజమాన్యం పథకం ద్వారా 1,18,152 ఎకరాల భూమి స్వాదీనం చేసుకున్నట్లుగా ప్రభుత్వ లెక్కలు తెలియజేస్తున్నాయి. సాముదాయక అటవీ యాజమాన్య పథకం ద్వారా రాష్ట్రంలో 6,92,130 ఎకరాల భూమిని ఆదివాసులు ఇతర పేదల నుండి స్వాదీనం చేసుకొనుటకు ప్రభుత్వం రంగం సిద్ధం చేసింది. అటవీ భూముల ఆక్రమణలు ఉత్తర తెలంగాణా జిల్లాలైన ఆదిలాబాద్, ఖమ్మం, వరంగల్ ఉత్తర కోస్తా జిల్లాలైన శ్రీకాకుళం, విశాఖపట్టణం, విజయనగరం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరిలలో ఎక్కువగా ఉన్నట్టుగా ప్రభుత్వం ప్రకటించింది.

కేంద్ర ప్రభుత్వం సర్క్యులర్‌ను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం హడావుడిగా 25-09-2002న రాష్ట్ర అటవీ శాఖ ద్వారా కన్సర్వేటర్స్ ఆఫ్ ఫారెస్టు అధికారులందరికి పంపించింది. దీనిని వారి పరిధిలోని డివిజనల్ ఫారెస్టు అధికారులందరికి పంపించి 15-6-2002 వరకు సమగ్ర నివేదికను పంపమని కోరింది. కేంద్ర ప్రభుత్వం సర్క్యులర్ వల్ల దేశంలో కోటి మందికి పైగా ఆదివాసి, ఇతర పేదలు నిరాశ్రయులవుతారు. రాష్ట్రంలో 2,76,852.02 హెక్టార్లు (6,92,130.05) ఎకరాల అటవీ భూమి అక్రమంగా వున్నట్లుగా 30-6-2002న రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఇందులో ఎక్కువభాగం ఆదిలాబాద్ జిల్లాలో 94,055.78 హెక్టార్లు (2,35,134.45 ఎకరాలు) ఖమ్మం జిల్లాలో 74,929.27 హెక్టార్లు (1,87,3232.18 ఎకరాలు) విశాఖపట్టణం జిల్లాలో 38,153.67 హెక్టార్లు (95,384.18) వరంగల్ జిల్లాలో 15,789.56 హెక్టార్లు (39,473.90) భూమి వుంది. అనగా నాలుగు జిల్లాల్లోనే 5,57,315.71 ఎకరాల భూమి వుంది. ఈ సర్క్యులర్‌ను అమలు చేయుటవల్ల రాష్ట్రంలో 4 లక్షలకు పైగా ఆదివాసి, ఆదివాసియేతర పేద ప్రజల కుటుంబాలు అనగా దాదాపు 25 లక్షల మంది ప్రజలు భూములు కోల్పోయి నిరాశ్రయులౌతారు. రెవెన్యూ గ్రామాలుగా పరిగణించని అనేక అటవీ గ్రామాలు ఖాళీ చేయవలసి వుంటుంది.

ఆదివాసుల జీవనాధారంపై దాడి చేసి వారిని తమ భూముల నుంచి ఖాళీ చేయించే సర్క్యులర్‌ను విడుదల చేసే సమయంలో ఆదివాసి మంత్రిత్వ శాఖలనుగాని, యస్.సి.యస్.టి. కమీషనర్‌ను గాని గిరిజనులకు సంబంధించిన కమీషన్‌ను కానీ, రాష్ట్ర ప్రభుత్వాలను కానీ, గిరిజనులకు సంబంధించిన పార్లమెంటరీ కమిటీని కాని రాజ్యాంగంలో పేర్కొన్న నిబంధనలు మేరకైనా సంప్రదించకుండా కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిందనే విషయం అత్యంత తీవ్రమైనది. గతంలో ఎన్నడూ లేని విధంగా జిల్లా కమిటీలలో (పోలీసు) జిల్లా యస్.పి.ని సభ్యునిగా చేసి అటవీ భూములు అక్రమణల నుండి తొలగించే కార్యక్రమంలో పోలీస్ యంత్రాంగాన్ని కూడా చట్టబద్ధంగా భాగస్వామిని చేయడమంటే ఏ విధంగానైనప్పటికి, ఎటువంటి పరిస్థితులనైనప్పటికి పోలీసు నిర్బంధం ద్వారా ఆదివాసులను తమ భూముల నుండి గెంటి వేయుటకు పూనుకుందనే విషయం స్పష్టంగా కనిపిస్తున్నది.

సాముదాయక అటవీ యాజమాన్య పథకం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అటవీ, పోలీసు అధికారులు కలిసి అమలు చేస్తున్నారు. ఆదిలాబాద్ జిల్లాలోని డి.యఫ్.ఓ. వినోద్ కుమార్ నాయకత్వంలో పోలీసుల సహాయంతో వి.యస్.యస్. సభ్యులతో కలిసి 2003 జూలై నెలలో ఉట్నూర్ మండలం బీర్సాయిపేట గ్రామ పంచాయితీలలోని ధర్మాజిపేట కోలాంగూడ మీద దాడి చేసి గుడిసెలను కాలబెట్టారు. కనబడ్డ వాళ్ళను కొట్టి(స్త్రీ, పురుషులను) బలవంతంగా ట్రాక్టర్, లారీలలో ఎక్కించుకోని కెరమెరి, నార్నూర్ ప్రాంతాలలో విడిచి పెట్టినారు. వారికి ఎలాంటి ఉపాధి చూపించక పోవడం చేత వచ్చి గుడిసెలు వేసుకున్నారు. ఈ సంవత్సరం 2004 ఆగష్టులో అటవీశాఖ అధికారులు తిరిగి దాడి చేసారని ధర్మాజిపేట గిరిజనులు తెలిపారు.

బాపురావు(52) మాడావిరాం(40) మాడావి కన్ను(46) మాడావి చిన్నుబాయి(32) మాడావి సీతాబాయిలపై దాడి చేసారని చెప్పారు. పొద్దుపోయిన సమయంలో జన్నారం డి.యఫ్.ఓ. వినోద్ కుమార్ ఆధ్వర్యంలో అటవీ అధికారులు, వి.యస్.యస్. సభ్యులు దాడి చేసారని బూట్లు కాళ్ళతో తన్నుతూ లాఠీలతో కొట్టారని తెలిపారు. దీనిపై తాము ఉట్నూర్ పోలీసులకు ఫిర్యాదు చేసినట్లు న్యూస్‌టుడేకు వారు తెలిపారు. అలాగే రెబ్బెన మండలం గోలేటి గ్రామ పంచాయితీ పరిధిలోని కైరిగూడ గిరిజన రైతులపై పంట చేలపై (500 ఎకరాలను) అటవీ శాఖ అధికారులు దాడులు చేసి నాశనం చేసారు. రైతులను అరెస్టు చేసి కేసులు పెట్టారు. ప్రభుత్వం వ్యవసాయ రంగానికి పెద్ద పీట వేస్తున్నామని ఆదివాసీల అభివృద్ధికి అనేక సంక్షేమ పథకాలు ప్రవేశపెడుతున్నామని చెపుతున్న వై.యస్. రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఆదివాసులు సాగుచేస్తున్న భూములను స్వాధీనం చేసుకోవడానికి అటవీ అధికారులచే దాడులు కొనసాగిస్తుంది.

**విడదీయరాని బంధం**

ఆదివాసుల జీవనానికి అనాదినుండి అడవులతో విడదీయరాని అవినాభావ సంబంధం ఉంది. వారసత్వం, సాంప్రదాయ, సామూహిక హక్కుగా అడవులను వీరు తరతరాలుగ అనుభవిస్తున్నారు. వీరి జీవనాన్ని అడవులు అటవీ ఉత్పత్తులు, బీడు భూములు ఇటీవల అత్యధిక ప్రాంతాలలో స్థిర వ్యవసాయంగా మారిన భూములు ప్రధాన ఆదారంగా ఉన్నాయి. సూటిగా చెప్పాలంటే వీరి జీవన విధానం అడవులలో అత్యంత సన్నిహితంగా ముడిపడి వుంది. అడవులను తమ జీవన హక్కుగా భావిస్తున్నారు.

సమాజాభివృద్ధి క్రమంలో ముఖ్యంగా బ్రిటిష్ వలస వాదుల కాలం నుండి వీరి జీవిత హక్కుపై దాడి ప్రారంభమై అంతకంతకూ పెరుగుతూ నేడు పరాకాష్టను చేరుకుంది. తరతరాలుగా తాము నివసిస్తున్న, అనుభవిస్తున్న ప్రాంతాలనే అక్రమణ ప్రాంతాలుగానూ, తమ భూముల్లోనే తమను "అక్రమణ దారులు" గాను చిత్రించి గెంటివేసే దుస్థితిని ఎదుర్కొంటున్నారు.

ఆదివాసులు తమ హక్కులు, ప్రయోజనులపై దాడి ప్రారంభమైనప్పటికి నుండి తమ హక్కులు పరిరక్షించుకొని ప్రయోజనాలు కాపాడుకొనుటకు వివిధ రూపాలలో ఉద్యమాలు చేపట్టారు, ప్రతిఘటించారు. చివరికి అనేక సందర్భాలలో వివిధ రూపాలలో పాలకుల గుండెల్లో గుబులు పుట్టించే విధంగా తిరుగుబాట్లు కూడా చేసారు. బ్రిటీష్ సామ్రాజ్యవాదం విస్తరిస్తున్న సమయంలోనే వారి తాతాదార్లయిన, జమిందార్లకూ, జాగీర్దార్లకూ, సంస్థానాదీశులకూ స్థానిక పరిపాలకులకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు చేసారు. బీహారు, బెంగాల్ ప్రాంతాలలో 1830లో జరిగిన కోల్ తిరుగుబాటు జరిగింది. జమిందార్లకు, వడ్డీ వ్యాపారులకు వ్యతిరేకంగా 1855-56 సం॥లో సంతాప్ తిరుగుబాటు జరిగింది. బ్రిటీష్ వారికి మధ్య దళారీలను వ్యతిరేకంగా 1887లో సర్దార్ ఉద్యమం జరిగింది. జాతి ఆధారంగా స్వంత రాజ్యాన్ని స్థాపించుకున్న బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా 1875లో బిర్సాముండా నాయకత్వంలో తిరుగుబాటు జరిగింది.

**తిరుగుబాట్లు**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1802-03 సం॥లో తూర్పుగోదావరి జిల్లాలో రాంభూపతి నాయకత్వంలో "రంప పితూరి" గా పిలవబడుతున్న తిరుగుబాటు జరిగింది. 1832 సం॥లో విశాఖపట్టణం జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతంలో తిరుగుబాట్లు జరిగాయి. 1879 సం॥లో తమ్మన్నదొర నాయకత్వంలో "రెంప" ప్రాంతంలో మరోసారి తిరుగుబాటు జరిగింది. 1922-24 సం॥ల మధ్య అల్లూరి సీతారామరాజు నాయకత్వంలో మాన్యంలో తిరుగుబాటు జరిగింది.

ఆదిలాబాద్ జిల్లాలో ఆదివాసులు తరతరాలుగా పాలకుల భూస్వాముల, షావుకార్ల దోపిడి పీడనలకు అణచివేతలకు గురవుతూ వీటికి వ్యతిరేకంగా నిరంతరం రాజీలేని పోరు సల్పుతూనే వున్నారు. నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఈ శతాబ్ది తొలిదశలో రాంజీగోండు నాయకత్వంలో ఆదివాసులు తిరుగుబావుటా ఎరుగవేశారు. దీనిని నిజాం ప్రభుత్వ కర్కశంగా అణచివేసింది. పోరాట నాయకుడు రాంజీగోండుతో సహా వేయి మందిని ఆదివాసులకు నిర్మల్‌లో రాక్షసంగా ఉరితీసింది. ఇప్పటికి వేయి ఊడల మర్రిగా ఆ చెట్టు ప్రసిద్ధి చెందిన ప్రదేశంగా మారింది. ఆసిఫాబాద్ తాలుకాలు షావుకారుల జంగ్లాతు అధికారుల, మక్తెదారులకు (భూస్వాములకు) వ్యతిరేకంగా కొమరం భీం నాయకత్వంలో ప్రారంభమయిన తిరుగుబాటు నైజాం ప్రభుత్వ వ్యతిరేక పోరాటంగా అభివృద్ధి అయి బాబేజరి, జూడేఘాట్, పాట్నాపూర్, తదితర పన్నెండు గ్రామాల విముక్తి సాయుధ సమరం పూరించగా రక్తంతో రుచిమరిగిన నైజాం ఈ న్యాయమైన పోరాటాన్ని క్రూరంగా అణచివేసింది. ఆదివాసి ప్రజల ప్రధాన సమస్య భూమి సమస్య తరతరాలుగా భూమి మీద ఆధారపడి వ్యవసాయం కొనసాగిస్తున్న ఆదివాసులకు బ్రాహ్మణ, ముస్లిం, కోమటి, రెడ్డి, వెలమ భూస్వాముల జాంగార్లు అధికారుల వేదింపులు, దౌర్జన్యాలు తీవ్రస్థాయిలో కొనసాగాయి. 1976-79 మధ్య కాలంలో జంగ్లాతు అధికారులు గ్రామాలకు గ్రామాలనే తగులబెట్టి ఆదివాసీలను కట్టు బట్టలతో గెంటివేసారు. భూముల కొరకు "ఇంద్రవెల్లి" గ్రామానికి పోయిన ఆదివాసి ప్రజల మీద కాంగ్రెస్ ప్రభుత్వం కాల్పులు చేస్తే 60 మంది ఆదివాసీలు మరణించారు.

1981 ఏప్రియల్ 20 నాడు ఇంద్రవెల్లి మరణకాండ కొనసాగింది అనే ఇంద్రవెల్లి మరణకాండగా చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించబడ్డ "1981 ఏప్రియల్ 20" సంఘటన.

అడవులు క్షీణించి, పర్యావరణ సమతుల్యం దెబ్బతీసుటకు 1)పోడు వ్యవసాయం 2) అడవుల అక్రమణ 3) వంట చెరుకుకు అడవులను ఎక్కువగా వినియోగించుట 4) పశువులను మేపుడు కారణాలని ప్రాజెక్టు నివేదిక తెలియ చేస్తున్నది. సారాంశంలో ఆదివాసులు, ఇతర పేదలను ఈ నష్టానికి ప్రధాన కారణంగా చూపిస్తున్నది. ఆ విధంగా గత 50 సం॥లో కేవలం పర్యావరణ నష్టం రూ॥లు 4,59,978 కోట్లుగా సుప్రీం కోర్టు నియమించిన నిపుణుల కమిటీ అంచనా వేసింది. దీనిని నివారించడానికి ఆ క్రమంలో ఉన్న అటవీ భూములన్నింటి నుండి ఖాళీ చేయించుట ఒక్కటే పరిష్కార మార్గంగా చూపింది ఈ విషయంలో ప్రభుత్వాలు పేర్కొంటున్న అంశాలు సమంజసమైవని కాదు. పైగా వాస్తవి విరుద్ధమైనవి.

పాలక వర్గాల ఉన్నతాధికార వర్గాల అండదండలతో కాంట్రాక్టర్లు, బడా కలప స్మగ్లర్లు పరిశ్రమల ముడి సరుకు కొరకు పారిశ్రామిక వేత్తలు అడవిని పెద్ద ఎత్తున నాశనం చేస్తున్నారు. అడవులను పెంచడం, కాపాడడంలో కూడా ప్రభుత్వాలు తీవ్ర నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూ వచ్చాయి. ఇటీవల అడవుల పెంపకం, కాపాడడంపై పెద్ద ఎత్తున ప్రచారం సాగిస్తున్నప్పటికీ ఆచరణలో జరుగుతున్నది బహుస్వల్పం. అడవులు నాశనమై పర్యావరణానికి పెనుముప్పు ఏర్పడుటకు పాలకవర్గాల విధానాలే ప్రధాన కారణం తప్ప ప్రజలు ముఖ్యంగా ఆదివాసులు ఎంత మాత్రం కాదు. "అడవులను ఆదాయానికి వనరుగా చూడకూడదు. అడవులు తిరిగి వినియోగించుకునే ప్రకృతి వనరు. ప్రజలు, దేశం సంక్షేమానికి అడవులు రక్షించి పెంచాల్సిన జాతీయ సంపద"గా 1988 జాతీయ అటవీ విధానం పేర్కొంది. ఇందుకు తగిన స్థాయిలో ఆర్థిక, ఇతర వనరులను పెట్టుబడిగా పెట్టాలని కూడా పేర్కొంది. అయినప్పటికీ పాలకవర్గాల వైఖరులు, విధానంలో ప్రాథమికంగా కూడా మార్పు రాలేదు.

గతం నుండి నేటి వరకు ఆదివాసులు ప్రధానంగా అడవులలోనే జీవిస్తున్నారు. అడవులు, అటవీ ఉత్పత్తులు అటవీ భూములే వారి జీవనానికి ప్రధాన వనరుగా వున్నాయి. వీరి గత చరిత్రనే కాక ప్రస్తుత జీవితాలు కూడా విడదీయలేనంతగా అడవులతో పెనవేసుకపోయి వున్నాయి. బ్రిటీష్ వారి పాలన ప్రారంభమై వారి పెట్టుబడి ప్రవేశించక ముందు భూమి సరుకుగా మారలేదు. భూమిపై వ్యక్తిగతంగా చట్టబద్ధ హక్కులు లేవు. అడవులపై పూర్తి హక్కు ఆదివాసులదే తరతరాలుగా వారసత్వంగా సాముదాయకంగా అడవులను, అటవీ ఉత్పత్తులను, అడవులలో సాగు చేసుకుంటున్న వ్యవసాయ భూములను అనుభవిస్తుండేవారు. పెట్టుబడి ఈ ప్రాంతాలకు భిన్న లక్ష్యాలతో అనేక రూపాలలో కాఫీ, తేయాకు, నీలిమందు లాంటి వాణిజ్య పంటలు, వ్యాపారం, పరిశ్రమలు తదితర రూపాలలో ప్రవేశించడం వల్ల నూతన ఆస్తి సంబంధాలు ఏర్పడ్డాయి. యుద్ధాల కార్యక్రమాలు వీటి కొరకు రవాణా మార్గాలు మార్పులకు దోహదపడ్డాయి. పెరుగుతున్న వినియోగం మార్కెటు అవసరాలను, పరిశ్రమలను కలపను ముడిసరుకుగా వినియోగించడం, ఓడలు, రైల్వే లైన్లు, బారీ ఎత్తున ఇళ్ళ నిర్మాణం అటవీ ఉత్పత్తులు సరుకుగా మారి వినియోగం పెరగడం నదీ పరివాహక ప్రాంతాలు సారవంతమైన భూములను పంటలు పండిచుటకు సాగులోనికి పెద్ద ఎత్తున తేవడం మొదలైనవన్నీ అడవులపై వత్తిడిని పెంచాయి. ఇవన్నీ ఆదివాసుల భూముల పరాయికరణకు త్రోవతీసి ఆదివాసులను వారు సాగు చేసుకుంటున్న భూములు, నివాసాల నుండి తరిమివేసి వారిని మరింత అడవుల లోపలి భాగానికి నెట్టాయి. మైదాన ప్రాంతాల సమాజంలో వచ్చే సంస్థాగత మార్పులు వాటిని అనుకుని వుండే ఆదివాసి ప్రాంతాలపై అనివార్యంగా ప్రభావాన్ని కలిగించాయి. రెవెన్యూ ఎక్సైజ్, అటవీ రంగాలు ప్రభుత్వ కార్యక్రమాలు, వ్యాపారం విస్తరించడం కొన్ని ప్రాంతాలలో నీటి పారుదల సౌకర్యాలు ఏర్పడటం అనేక విధాలుగా ఆదివాసేతరులు వలసలకు తోడ్పడింది. తమ ఆదాయాన్ని పెంచుకొనుటకు బ్రిటీష్ ప్రభుత్వం, సంస్థానాధ్యక్షులు కూడా వలసలను ప్రోత్సాహించారు. ఈ విధంగా నాగరిక సభ్య సమాజం అభివృద్ధి ఆదివాసుల శాపంగా మారి భూములు కోల్పోవుటకు దారి తీసింది. ఉదా॥ ఆదిలాబాద్ జిల్లాలో సింగరేణి బొగ్గు గనులు, సిర్పూర్ పేపర్ మిల్లు, ఓరియంట్ సిమెంట్ ఫ్యాక్టరీ, ఎ.సి.సి. సిమెంట్ ఫ్యాక్టరీ మూలంగా వేలాది మంది ఆదివాసిలు నిర్వాసితులయినారు.

ఈ పరిశ్రమలలో ఎంతమంది ఆదివాసీలు కార్మికులు పనిచేస్తున్నారు అని చూసినప్పుడు 1% కూడా వుండరు. ఈ ప్రాంతాలలో ఉన్న ఆదివాసుల భూములు కోల్పోయి లోతట్టు అడవి ప్రాంతాలకు పోయి బ్రతుకుతున్నారు. తిర్యాణి మండలంలోని డోర్లి, దంతన్‌పల్లి, దేవాయిగూడెం, బోర్దం, గోమారిగూడెం, అరెగూడెం, డోంగర్‌గాం గ్రామాలను ఎత్తివేసి సింగరేణి ఓపెన్‌కాస్ట్ బొగ్గు ప్రాజెక్టును తీసుకువస్తున్నారు. ఆ ప్రాంతంలో వున్న ఆదివాసులకు సాగు చేసుకుంటున్న భూముల పట్టాలు లేవు. కొంత మందికి మాత్రమే పట్టాలు వున్నాయి. సింగరేణి యాజమాన్యం కొంత మందికి వున్న పట్టా భూములకు డబ్బులు చెల్లించి పట్టాలు లేని వారందరికీ

సింగరేణి యాజమాన్యం ఎలాంటి నష్టపరిహారం చెల్లించకుండా భూముల నుండి బేదఖల్ చేస్తున్నది. ఈ విధంగా ఆదివాసి ప్రాంతాలలోకి పరిశ్రమలు చొచ్చుకవచ్చి వేలాది మంది ఆదివాసులు పొట్టచేత పట్టుకొని సుదూర లోతట్టుకు పరుగులు తీస్తున్నారు.

బ్రిటీష్ వారి పరిపాలనలో గిరిజన ప్రాంతాలలో నేరుగా జోక్యం చేసుకోవడం ప్రారంభమై అంతకంతకూ తీవ్రమయింది. అనేక చోట్ల స్థానిక జమిందార్ల ద్వారా ప్రవేశించుట జరిగింది. బ్రిటీష్ వలస పాలనకు స్థానిక జమిందార్ల దోపిడి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా అడవిపై, భూములపై హక్కుల కొరకు వివిధ ప్రాంతాలలో ఆదివాసులు అనేక ఆందోళనలు, తిరుగుబాట్లు చేసారు. ఈ తిరుగుబాట్ల ఫలితంగా బ్రిటీషు ప్రభుత్వం కన్నీటి తుడుపుగా ఆదివాసి ప్రాంతాలను, ఇతర ప్రాంతాల నుండి మినహాయిస్తూ 1874లో షెడ్యూల్డు జిల్లాల చట్టం చేసింది. ఈ చట్టం క్రింది సివిల్, క్రిమినల్‌కు సంబంధించి రూపొందించిన నియమాలే నేటికి ఈ ప్రాంతాలకు వర్తిస్తున్నాయి. దేశంలో ఆదివాసుల ప్రయోజనాలకు కాపాడుటకు మరింత సమగ్రంగా "1917 ఏజెన్సీ ప్రాంతాల ప్రయోజనాలు, భూలుదలాహింపు చట్టం" చేసింది. ఆదివాసుల స్థిరాస్థులు ఏ విధంగా కూడా ఆదివాసేతర్లు పొందటాన్ని ఈ చట్టం నిషేదించింది. ప్రభుత్వ ఏజెంటు అనుమతితో మాత్రమే ఆదివాసుల భూములు ఆదివాసేతర్లు పొందడానికి వీలు కల్పించారు. తరువాత వివిధ రాష్ట్రాల ఈ విధంగా కూడా ఆదివాసేతర్లు భూములు పొందడాన్ని నిషేదిస్తూ చట్టాలు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్‌లో 1959లో 1917 చట్టాన్ని సవరించి ఆదివాస భూములు ఆదివాసేతర్లు ఏ విధంగా కూడా పొందటాన్ని నిషేదిస్తూ చట్టం చేసింది 1970 లో ఆదివాసేతర్లు మధ్య భూ అమ్మకాలు కొనుగోళ్ళను నిషేధిస్తూ 1 ఆఫ్ 19170 చట్టం చేయుట జరిగింది. ఈ చట్టాలు కాగితాలకు పరిమితమై ఆదివాసుల భూమి పరాయికరణకు ఆపలేక పోయాయి.

**1/70 చట్టం**

1/70 చట్టాన్ని రూపొందించిన ఈ చట్టాన్ని అమల్లో పెట్టిన దాఖలాలు లేవు. ఈ చట్టాన్ని సరిగ్గా అమలు చేస్తే ఉదా॥ ఆదిలాబాద్ జిల్లాలో ఈ రోజు వరకు ఏజెన్సీ ప్రాంతంలో వున్న బజారు హత్నూర్ ఇచ్చోడ, గుడిహత్నూర్, ఇంద్రవెల్లి, ఇట్నూర్, జైనూర్, సిర్పూర్(యు) కెరమెరి, వాంకిడి ఆసిఫాబాద్, తిర్యాణి తదితర మండలాలు అన్ని పూర్తిగా ఆదివాసేతర భూస్వాముల, షావుకార్ల వడ్డీ వ్యాపారులు చేతుల్లోనే వున్నాయి. ఈ 1/70 చట్టాన్ని అమలు చేస్తే మండల కేంద్రాలలో ఎవరూ మిగలరు. ఈ పట్టణాలలోనే కోట్లాది రూపాయల విలువ చేసే ఆస్తులు ఆదివాసేతర భూస్వాములు, వడ్డీ వ్యాపారుల షావుకార్ల చేతుల్లో వున్నాయి. వారి వత్తిడి మూలంగా ఈ 1/70 చట్టాన్ని ఎత్తివేయడానికి తీవ్రంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ ప్రయత్నాలలో ఆదివాసులమని చెప్పమంటున్న అధికార, ప్రతిపక్ష పార్టీల నాయకులు సైతం తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నారు. ఈ ప్రయత్నాలను ఆదివాసులు సంఘటితంగానే దశాబ్దకాలంగా తిప్పికొడుతున్నారు. ఇప్పుడు బహుళజాతి గుత్త సంస్థలకు లాభాలు ఆర్జించుకోవడానికి ఐ.యం.యఫ్. ప్రపంచబ్యాంకు పరిపాలిస్తున్న ఈ రాష్ట్రంలో గతంలో చంద్రబాబునాయుడు, నేడు రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఈ చట్టాన్ని ఎత్తివేయడానికి లేదా సవరించడానికి తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నది. దీనిని సైతం ఆదివాసులు మరింత సంఘటితంగా ప్రతిఘటించాలి. ఈ మధ్యకాలంలోనే జైనూర్ మండలం గౌరి గ్రామంలో (జూలై 2004) భూమి విషయంపై ఆదివాసులు ఆదివాసేతర్ల మధ్య ఘర్షణ ఏర్పడింది.

ఇరువర్గాల మధ్య వాగ్వివాదం జరగడంతో 2 గంటల సేపు ఉద్రిక్తత ఏర్పడింది. ఊట్నూర్ మండలం దంతన్‌పల్లి (ఏజెన్సీ గ్రామం) లో ఆదివాసేతర్లు ఆదివాసులను కొట్టారు. వాస్తవంగా ఆదివాసేతర్లు గ్రామంలో (చట్టపరంగా) ఒక గుంట భూమి వుండడానికి హక్కులేదు కాని ఈ రోజు వాస్తవంగా దంతన్‌పల్లి గ్రామంలో వరి భూములన్ని రెడ్ల భూస్వాములు పరంలో వున్నాయి. ఆదివాసులు రెడ్లకు పాలేర్లుగా జీవితం గడుపుతున్నారు. జన్నారం మండలం కవ్వాల గ్రామం ఏజెన్సీ పరిధికిందికి వస్తుంది. గత 30 సంవత్సరాల క్రిందటి గ్రామంలో ఆదివాసుల జనాభా మెజార్టీ వుండేది. భూములు కూడా ఆదివాసుల చేతిలో వుండేవి. కాని ఈ రోజు కవ్వాల గ్రామంలో మెజార్టీ ప్రజల భూములన్నీ ఆదివాసేతర్ల పరం అయినాయి. ఈ విధంగా ఏజెన్సీ గ్రామాలలో ఆదివాసులు భూములు కోల్పోయి గ్రామాలలో మైనార్టీగా వుంటూ జీవనం కొనసాగిస్తున్నాయి. ప్రభుత్వం అధికారులు 1/70 చట్టాన్ని అమలు చేయడంలో లోపం మూలంగా ఆదివాసుల భూములన్నీ పరాయికరణ చెందుతున్నాయి.

తరతరాలుగా ఆదివాసులు అడవిపై అనుభవిస్తున్న హక్కులను బ్రిటీష్ ప్రభుత్వ కాలంలోనే క్రమంగా హరించి వేసి తమ భూములకే చట్ట బద్ధ హక్కులు ప్రభుత్వం నుండి పొందే విధానం ప్రారంభమైంది. ఆదివాసులు సాగుచేసుకుంటున్న భూములకు చట్టబద్ధ హక్కులు కల్పించాలనే విధానం 1980లో అటవీ సంరక్షణ చట్టం చేసే వరకు కొనసాగింధి. అటవీ భూములు సాగుచేసుకుంటున్న ఆదివాసులను అక్రమణ దారులుగా 1980 అటవీ సంరక్షణ చట్టం పేరు ఉంది. 1988 జాతీయ అటవీ విధానం 1990 లో కేంద్ర పర్యావరణ

అటవీశాఖ విడుదల చేసిన అనేక సర్క్యులర్లు ఈ అవగాహననే కొనసాగించాయి. సాగుచేసుకుంటున్న భూముల క్రమబద్ధీకరణ జరగక పోవడానికి అనేక కారణాలు వుండవచ్చు. వాస్తవ కారణాలను పరిశీలించకుండా ఆ విధంగా వీరిని అటవీ భూముల ఆక్రమణదారులుగా పేర్కొనటాన్ని బి.డి. శర్మ తప్పు పడుతూ "ఆదివాసి ప్రజలు ఆక్రమించుకున్న భూములు రిజర్వు ఫారెస్టు భూమిని ఆక్రమించుకొనుట జరిగిందనే భావనతో వుండుట ఈ ఆదేశాలన్నింటిలో వున్న ఒక ముఖ్యమైన విషయం రిజర్వు ఫారెస్టు భూమిలోకి రిజర్వు కాని భూములను ఆదివాసులు ఆక్రమించుకొన్నారని తప్పుడు అభిప్రాయం అనేక సందర్భాలలో ఆదివాసులు పేర్కొన్నారు." "1980 ముందు 1980 తర్వాత జరిగిన ఆక్రమణ మధ్య తేడాను గుర్తించడం వాస్తవంగా అసాధ్యం." అందువలన భూముల క్రమబద్ధీకరణకు ఒక వ్యక్తి అదీనంలో వుండి సాగుచేసుకుంటున్న భూమి ఎప్పటి నుండి సాగుచేసుకుంటున్నాడు. అనే దానికి ఆధారాలు చూపించడంలో అనేక సమస్యలున్నాయి కనుక అటవీ భూములకు సంబంధించి సాధారణ ప్రజల ముందు బహిరంగంగా ప్రతి గూడెంలోను సమావేశాలు చేసి, చర్చించి వాస్తవాలు అక్కడే పరిశీలించి ప్రజలు ప్రభుత్వ అధికారుల మధ్య పూరిత అంగీకారం ప్రాతిపదికపై జాబితా తయారు చేయాలని యస్.సి., యస్.టి. కమీషన్ తన 29వ నివేదికలో పేర్కొన్నది. అంతేగాక ఒక వ్యక్తి స్వాదీనంలో ఉన్న భూమి చట్టరీత్యా ఏ స్థితి కలిగివున్నప్పటికి ఒకవేళ అటవీభూమే అతని జీవనాధారంగా వుండి, అతను కొంతకాలంగా ఆ భూమిలో సేద్యం చేసుకుంటున్నట్లయితే అటువంటి పరిస్థితిలో అతనిని ఆ భూమి నుండి తొలగించుటకు ఎవరికి హక్కులేదు. అతని జీవనాధారం కనుక భూమి అతని జీవిత హక్కుతో ముడిపడి వుంది. ఆదివాసులు తాము సాగుచేసుకుంటున్న భూముల నుండి తొలగించకుండా రాష్ట్ర ప్రభుత్వం వెంటనే ఉత్తర్వులు ఇవ్వాలి. వారిపై అటవీ భూములకు సంబంధించి కోర్టుల్లో పెండింగ్‌లు ఉన్న కేసులన్నింటిని తక్షణం ఉప సంహరించాలనీ కూడా స్పష్టంగా ప్రకటించింది. ఒకవైపున యస్.యస్.టి కమీషన్ ఆదివాసులు తమ జీవనాధారంగా సాగు చేసుకుంటున్న భూములు అతని జీవిత హక్కుగా ప్రకటిస్తుండగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం వారిని ఇప్పటికీ అటవీ భూముల ఖబ్జాదారులుగా పేర్నొనడం అత్యంత దారుణమైన విషయం. అనేక సంవత్సరాలుగా సాగు చేసుకుంటున్న తమ భూములనే ఆక్రమించుకున్న కబ్జాదారులుగా ఆదివాసులను పేర్కొనడం ఘోరాతి ఘోరమైన విషయం.

క్రమబద్ధీకరణకు సంబంధించిన కేంద్ర ప్రభుత్వ సర్క్యులర్‌లు రాష్ట్రంలో ఎక్కడా సక్రమంగా అమలు జరగలేదు. పైగా సాగు చేసుకుంటున్న అటవీ భూములను పట్టాలిచ్చే కార్యక్రమాన్ని రద్దు చేస్తున్నట్టుగా 1995 రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పటి ముఖ్యమంత్రి వై.యస్.రాజశేఖర్ రెడ్డి ఆదివాసులపై ఎక్కడ లేని ప్రేమను ఒలక పోస్తున్నాడు. సాగు చేసుకుంటున్న భూముల నుండి ఖాళీ చేయించబోమని అత్యంత మోసపూరితంగా ప్రకటిస్తున్నాడు. గత 17 సం॥లుగా ఆదివాసులు సాగుచేసుకుంటున్న భూములకు పట్టాలిచ్చుటకు చర్యలు తీసుకోకుండా కనీసం సర్వే కూడా ప్రారంభించకుండా వున్న రాష్ట్ర ప్రభుత్వం ఉమ్మడి అటవీ యాజమాన్య పథకం క్రింద 45,260.52 హెక్టార్లు ఆదివాసుల నుండి స్వాధీనం చేసుకున్నా ప్రభుత్వం మరొక వైపు సాముదాయక అటవీ యాజమాన్యం క్రింద సాగు భూములు స్వాధీనం చేసుకోవడానికి అన్ని విధాలా ప్రయత్నిస్తూ మరోవైపున భూముల నుండి ఆదివాసులను తొలగించమని వై.యస్.రాజశేకర్ రెడ్డి ప్రభుత్వం ఆడుతున్న నాటకాన్ని అర్థం చేసుకోవాలి.

ఆదివాసి ప్రయోజనాలు రక్షణకోసం చేయబడిన చట్టాలు వారి సంక్షేమం కొరకు చేపట్టిన పథకాలు కేవలం ప్రచారానికి, కాగితాలకు పరిమితమయ్యాయి. పాలక వర్గ రాజకీయ నాయకులకు ఆదివాసులను ఓటు బ్యాంకులుగా వినియోగించుకొనుటకు వారిని కొల్లగొట్టి జేబులు నింపికొనుటకూ సాధనాలుగా మాత్రమే వినియోగపడుతున్నాయి.

ఆదివాసుల సమర ఉద్యమాలను నీరు గార్చి దెబ్బ తీయుటకు కన్నీటి తుడుపుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని చట్టాలు చేసాయి. సంస్కరణలు చేపట్టాయి. పోరాడి సాధించుకున్న హక్కులను కాలరాచి వేయుటకు ఇప్పుడు పూనుకుంటున్నాయి. ప్రపంచబ్యాంకు దన్నుతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆదివాసులు సాగు చేసుకుంటున్న భూములన్నింటి నుండి దౌర్జన్యంగా గెంటివేయుటకు అన్ని విదాలుగా కొనసాగిస్తున్నాయి. "ఆక్రమణ"ల పేరుతో భూముల నుండి గెంటి వేసే విధానం వల్ల జీవన్మరణ స్థితిని ఆదివాసులు ఎదుర్కొంటున్నారు. సాంప్రదాయకం గానూ, పోరాటాల ద్వారానూ సాధించుకున్న భూములను రక్షించుకొనుటకు ఆదివాసులు ఇతర పేద ప్రజలు నడుం బిగించాలి. సాగు చేసుకుంటున్న అటవీ భూములన్నింటికి పట్టాలు ఇవ్వాలి. 1/70 చట్టాన్ని ఖచ్చితంగా అమలు చేయాలి అనే డిమాండ్స్ మీద పోరాటాన్ని ఉధృతం చేయాలి. ఆదివాసులకు అన్ని వర్గాల ప్రజలు, మేధావులు, వివిధ ప్రజా సంఘాలు మద్దతు తెలియ చేయాలి. ఆదివాసి సంఘాలు ఐక్యంగా వుంటూ ఆదివాసి హక్కుల కొరకు పోరాడిన బిర్సాముండా, అల్లూరి సీతారామరాజు, రాంజీగొండు, ఇంద్రవెల్లి అమరుల కొమురం భీము వారసత్వాన్ని ముందుకు తీసుకుపోవాలి.



# ప్రయివేటు రంగంలో రిజర్వేషన్లు

-బత్తుల పున్నయ్య

"ఆర్థిక సాంఘిక దోపిడీ లేని సామ్యవాద తరహా సమాజాన్ని నెలకొల్పడమే ధ్యేయంగా ప్రజాస్వామ్య సార్వభౌమ గణతంత్ర పరిషత్ కృషి చేస్తుంది". అన్న మన రాజ్యాంగ ప్రవేశిక కల్పించిన హామీ నేటికీ అర్థవంతం కాలేదు. సామాజిక న్యాయం నినాదంతో అధికారాన్ని చేపట్టిన 'ప్రగతిశీల ఐక్య కూటమి' సంకీర్ణ ప్రభుత్వం బడుగు బలహీన వర్గాలకు ప్రైవేట్ రంగంలో కూడా రిజర్వేషన్లను కల్పించే సంకల్పాన్ని ప్రకటించింది. ఈ విషయాన్ని రాష్ట్రపతి ఉభయ సభల్లో చేసిన ప్రసంగంలో కూడా స్పష్టపరిచారు. అలాగే మహారాష్ట్ర సంకీర్ణ ప్రభుత్వం కూడా ఇప్పటికే ఈ మేరకు ఒక చట్టం చేసింది.

గత ఎన్‌డిఏ ప్రభుత్వం, లాభాలతో నడుస్తూ, దేశ అవసరాలు తీరుస్తున్న ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేట్‌రంగానికి అప్పగించేందుకు ఏకంగా ఒక మంత్రిత్వశాఖనే సృష్టించింది. ఫలితంగా ప్రజల ఉద్యోగ ఉపాధి అవకాశాలు దారుణంగా కుంచించుకుపోయాయి. ఉపాధి అవకాశాలు లేక దుర్భర జీవితాలను గడుపుతున్న ప్రజలకు కనీస రక్షణలను కల్పించడం అనేది, సామాజిక న్యాయం పరిధిలోనిది. ఈ ప్రక్రియలో ఉద్యోగ ఉపాధికల్పన ప్రధానం. అయితే ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్లు అన్న అంశంపై కొందరు నీళ్ళు నములుతున్నారు.

భారత పారిశ్రామికసంస్థ అధ్యక్షుడు సునీల్ కాంత్ ముంజాల్ ఇలా అన్నారు: " ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్లు కల్పించడం దళిత బహుజనుల సమస్యలకు పరిష్కారం కాబోదు. ఈ రిజర్వేషన్లవల్ల 'ప్రతిభ' దెబ్బతిని, భారత పారిశ్రామికరంగం అంతర్జాతీయ విఫణిలో పోటీతత్వాన్ని కోల్పోతుంది. కనుక ప్రతిభ విషయంలో రాజీపడలేము" (2004 జూన్ 21, హిందూ). ఇదే స్వరంతో భారత పారిశ్రామిక వాణిజ్య సమాఖ్య అధ్యక్షుడు వై.కె.మోడీ కూడా 2004 సెప్టెంబర్ 3న ఢిల్లీలో ఒక ప్రకటన చేశారు.

అలాగే మహాత్మగాంధీ అనుయాయుడు రాహుల్ బజాజ్ మనుమడు రాహుల్ బజాజ్ కూడా, ప్రైవేట్‌రంగంలో రిజర్వేషన్ల నిర్ణయాన్ని మహారాష్ట్ర ప్రభుత్వం వెనక్కి తీసుకోకపోతే తమ పరిశ్రమలన్నింటిని వేరే రాష్ట్రాలకు తరమిస్తామని 2004 సెప్టెంబర్‌లో హెచ్చరించారు. ఆగష్ట్ 8న ఢిల్లీలో జరిగిన పత్రికా సంపాదకుల ప్రిసీడియం సభ్యుడు, సెక్యులర్ డెమొక్రటిక్ ఫోరం సమావేశంలో కూడా ఈ 'సామాజిక న్యాయం' అంశమే ప్రధాన ఎజండాగా నిలచింది.

**విద్య-ఉద్యోగ వర్గ, కుల చరిత్ర**

బ్రిటీష్ పరిపాలనలోనే, అన్నికులాల వారికి 'విద్యాబోధన' అమలులోకి వచ్చింది. 1858లో లార్డ్ మెకాలే ప్రవేశపెట్టిన ఆంగ్ల విద్యను- ఆనాటి సమాజంలో అగ్ర కులస్తులైన బ్రాహ్మణులు, జమిందారీ, జాగిర్దారీ బ్రాహ్మణేతర హిందూ అగ్రకులాలవారు- అభ్యసించి బ్రిటీష్ ప్రభుత్వ ఉద్యోగాలలో చేరారు. 1912లో బ్రిటీష్ పాలిత రాష్ట్రాలలోని జిల్లా మెజిస్ట్రేట్‌లలో 72.6 శాతం, సబ్‌జడ్జీలలో 83.3 శాతం బ్రాహ్మణులు. నాటి 1056 మంది ఐసిఎస్ అధికారుల్లో 363 మంది యూరోపియన్లు కాగా, మిగిలిన 693 అధికారుల్లో 70 శాతం బ్రాహ్మణులు. మిగతా వారంతా బ్రాహ్మణేతర అగ్రకుల హిందువులు-అని ఒక పరిశీలన వివరించింది. ఈ పరిస్థితి బ్రాహ్మణేతర అగ్రకుల హిందువుల్లో అలజడికి దారితీసింది. ఫలితంగా 1901లో తంజావూర్ కలెక్టర్ బెడ్‌ఫోర్డ్-బ్రాహ్మణ వర్గాలను తగ్గించి, ఆ మేరకు బ్రాహ్మణేతర హిందూ కులాలవారికి ఉద్యోగాలు ఇవ్వాలని ఉత్తర్వులు జారి చేశాడు. ప్రస్థుతం ఫ్రంట్‌లైన్ సంపాదకులు ఎన్.రాయ్. (ఇపిడబ్ల్యు. 1979. పే 383-84) అదే కాలంలో మైసూర్ రాష్ట్రంలోని కన్నడ బ్రాహ్మణులు-తమిళ బ్రాహ్మణుల తాకిడి తట్టుకోలేక తమకు రిజర్వేషన్లు కావాలని ఉద్యమించారు. ఫలితంగా తమిళబ్రాహ్మణుల్ని తగ్గించి ఆ మేరకు కన్నడ బ్రాహ్మణులను నియమించడం జరిగింది.

క్రమంగా బ్రాహ్మణేతర హిందూ అగ్రకులాల్లో అసంతృప్తి అధికమవుతున్న దశలో 1935 ఇండియా ఆక్ట్ ప్రకారం దేశీయులే రాష్ట్రాలలో ప్రభుత్వాలను చేపట్టడం జరిగింది. ఈ నేపథ్యంలో 1937 నవంబర్ 1న మద్రాస్ ప్రెసిడెన్సీ ముఖ్యమంత్రి ఒ.పి. రామస్వామి రెడ్డియార్, 14 ఉద్యోగాలను యూనిట్‌గా తీసుకొని, బ్రాహ్మణేతర అగ్రకుల హిందువులకు 6 (44 శాతం), బ్రాహ్మణులకు 2, వెనుకబడిన కులాల హిందువులకు 2, పీడిత (ఎస్‌సి, ఎస్‌టి) కులాల వారికి 2, ముస్లింలకు 1, క్రైస్తవులు-ఆంగ్లో ఇండియన్లకు ఉమ్మడిగా రిజర్వేషన్లను కల్పిస్తూ జిఒ జారీ చేశారు. ఈ రిజర్వేషన్లు అగ్రకులాల

వారికి అనుకూలంగా, నిరాటంకంగా సాగుతూ వచ్చాయి.

**విశ్వవిద్యాలయాలా, అగ్రకులాల ఆలయాలా?**

1951లో మద్రాస్ మెడికల్ కాలేజీలో, ఎక్కువ మార్కులు తెచ్చుకున్న బ్రాహ్మణ చంపకదొరైరాజ్ యువతికి సీటు ఇవ్వకుండా, తక్కువ మార్కులున్న బ్రాహ్మణేతర అగ్రకుల హిందూ విద్యార్థికి 1937 జిఒ ప్రకారం సీటు ఇవ్వడం జరిగింది. కాని 1950 నూతన రాజ్యాంగం ప్రకారం 1937 జిఒ చెల్లదని మద్రాస్ హైకోర్టు ఆశ్రయించగా, చంపకం-బ్రాహ్మణయువతికి అనుకూలంగా తీర్పు వచ్చింది. ఆ తీర్పును సుప్రీంకోర్టు ధృవీకరించింది. 1937 నుంచి1951 వరకూ రిజర్వేషన్లు-సామాజిక వెనుకబాటుతనం, అంటరానితనం, అణచివేతల ప్రాతిపదికగా కాక, పాలకవర్గ అగ్రకులాలకు అనుకూలంగా సాగినా, దళిత బహుజన వ్యతిరేక మేధావులెవరూ పెదవి విప్పలేదు.

1984-87లో ప్రొ.జి.ఎన్.రెడ్డి వైస్‌ఛాన్స్‌లర్‌గా ఉన్న శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో, మొత్తం 76 బోధనా సిబ్బందిలో 34 మంది (47 శాతం) రెడ్లను నియామకం చేయగా, 1991లో ప్రొ॥ జయరాంరెడ్డి వి.సి.గా 68 మంది సిబ్బందికి గాను 34 మంది (50 శాతం) రెడ్లను నియమించారు. 1988-91లో కమ్మ వి.సి. ప్రొ॥ఎస్.వి.జె.లక్ష్మణ్ హయాంలో మొత్తం 62 మంది సిబ్బందిలో 24 మంది (40 శాతం) కమ్మవారిని ఎంపిక చేశారు. ఈ విధంగా కులమే అన్నింటికి మూలమయింది.

దేశంలో 239 యూనివర్సిటీలు, ఏడు వేలకు పైగా అనుబంధ కళాశాలల్లో, అర్హతలున్న ఎస్ సి, ఎస్ టి లకు రావలసిన 67,500 బోధనా సిబ్బంది ఉద్యోగాలలో 3,500 (2 శాతం) కూడా వారికి దక్కలేదు. దేశ రాజధానిలో 1500 ఉద్యోగాలకు గాను 33 పోస్టులనే ఎస్ సి,ఎస్ టి లతో భర్తీ చేశారు. బిసి ఉద్యోగాల లభ్యత కూడా ఇంతే! ఢిల్లీలో,రాష్ట్రాలలో పరిశీలిస్తే, 80 శాతం ఉన్న దళితబహుజనులు 8 శాతం ఉద్యోగాలలోను, 20 శాతం ఉన్న అగ్రకులాలవారు 92 శాతం ఉద్యోగాలలోను ఉన్నారు.

'ప్రతిభ-సమర్థత' గురించి న్యాయమూర్తుల అభిప్రాయాలు. "సమాజంలో యుగ యుగాలనుండి అన్ని అవకాశాలు అనుభవిస్తున్న అగ్రకులాల వారు, దళిత బహుజనులకు 'రిజర్వేషన్లు'-అన్న అంశం రాగానే, 'ప్రతిభ-సమర్థత' వంటి పదాలను వల్లిస్తుంటారు. రిజర్వేషన్ల వల్ల ప్రతిభ, సమర్థత దెబ్బతింటాయని నిరూపించేందుకు శాస్త్రీయమైన ఆధారాలు గాని, గణాంక వివరాలుగాని లేవు. ఇది అవకాశవాద మిథ్యావాదం"

-జస్టిస్ ఒ.చిన్నప్పరెడ్డి
ఎఐఆర్ 1985 సుప్రీంకోర్టు.

'ప్రతిభ' దేవుడి గర్భగుడిలో ఉండే పవిత్రమైన, అపురూపదైవిక పదార్థం కాదు, అగ్రకులాల పేర్లచివర తగిలించుకునేందుకు, అదివారి సొంతం కాదు. ప్రతిభ-శిష్యుని చెవిలో గురువు చెప్పే మంత్రం కాదు. సమర్థత, తెలివి తేటలు అన్నీకులాల సొత్తు, అంతే గాని అది అగ్రకులాల కొలమానం కాదు.

-జస్టిస్ రత్న ప్రసాద్ పాండియన్
ఎఐఆర్ 1985 సుప్రీంకోర్టు.

**సామాజిక న్యాయానికి ప్రథమస్థానం**

పరిశ్రమలు, ముఖ్యంగా భారీ పరిశ్రమలు ప్రజాగంగంలోనే ఉండాలి. తద్వారా బడుగు, బలహీన వర్గాలవారికి ఉద్యోగాలు, ఉపాధితోబాటు, భౌతిక అవసరాలు సమకూరి సామాజిక న్యాయం లభిస్తుందని ఆ నాటి రాజ్యాంగ నిర్ణాయకసభ నిర్ణయించింది. అందువల్ల ప్రైవేటీకరణ విధానమే రాజ్యాంగ అధికరణాలు 46,47లకు విరుద్ధమని ప్రముఖ రచయిత హారిసన్ పేర్కొన్నాడు.

రిజర్వేషన్లను కల్పిస్తున్న అనేక ప్రభుత్వరంగ సంస్థలు మార్కెట్ ఎకానమీలో కాక, ప్రజావసరాలు తీర్చే విధంగా నడుస్తూ జాతీయ-అంతర్జాతీయ రంగాలలో తమసత్తా చూపుతున్నాయి. ఏ విదేశీ సంస్థకు తీసిపోని విధంగా అంతర్జాతీయ కీర్తిని ఆర్జిస్తున్నాయి. కొన్ని ప్రభుత్వరంగ పరిశ్రమలు నష్టాలలో ఉన్నా అందుకు కారణం ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాలే. ఆమాటకొస్తే అనేక ప్రైవేట్ సంస్థలు కూడా మూత పడడం లేదా?

దేశంలోని అన్ని రాష్ట్రాలకంటే అధికంగా 68% రిజర్వేషన్లు కల్పిస్తున్న తమిళనాడు అన్నిరంగాల్లో ఉత్తమ ఫలితాలు సాధిస్తూ అన్ని రాష్ట్రాలలో ప్రథమస్థానంలో ఉంది. అమెరికాలో-అమెరికన్ ఆఫ్రికన్లకు, స్థానిక రెడ్ ఇండియన్లకూ రిజర్వేషన్లు కల్పిస్తూ-ప్రపంచంలోనే ఉత్తమ ఫలితాలు సాధిస్తున్నారు.

రెండూ ప్రజారంగాలే!

ప్రభుత్వరంగం, ప్రైవేట్‌రంగం రెండూ కూడా ప్రజారంగాలే! ప్రభుత్వరంగ సంస్థలకు పెట్టుబడులు ప్రజలు చెల్లించే పన్నుల ద్వారా సమకూరుతుండగా, ప్రైవేట్‌రంగ సంస్థలు ప్రజల సొమ్ము అయిన "షేర్లు, డిబెంచర్లు, దీర్ఘకాలిక డిపాజిట్లే పెట్టుబడిగా నడుస్తున్నాయి. అంతేకాక ప్రైవేట్‌రంగ సంస్థలు ప్రభుత్వం నుంచి భూమి, విద్యుత్, నీరు పన్నులు వగైరా విషయాలలో అనేక



# రైతాంగానికి సహాయం... పెరిగిన రుణ సదుపాయం



మన రాష్ట్రంలోని గ్రామీణ, వ్యవసాయ రంగాలు నిలకడగా అభివృద్ధిని సాధించాలంటే సమర్థమైన పరపతి విధానం చాలా అవసరం. ప్రస్తుత సరళీకృత ఆర్థిక విధానాలు మన గ్రామీణ పరపతి సంస్థలను తీవ్రంగా ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల వీటికి అనుగుణంగా మన విధానంలో మార్పులు తీసుకొని రావాలి. వ్యవసాయ రంగంలోని ఉత్పత్తికీ, పెట్టుబడులకూ, వెన్నుదన్నుగా నిలిచే పరపతి విధానాన్ని రూపొందించుకుని, గ్రామీణ పరపతి సంస్థలను బలోపేతం చేయాలి.

## పెరిగిన రుణ సహాయం

రాష్ట్రంలో చిన్నతరహా, మధ్యతరహా రైతులు వ్యవసాయ రుణాల అవసరాలు ఇంకా తీరాల్సి ఉన్నా ఈ తరుణంలో రాష్ట్ర ప్రభుత్వం అనేక చర్యలు చేపట్టింది. 2003-2004 ఆర్థిక సంవత్సరంతో సరిపోల్చి చూస్తే 2004-2005 సంవత్సరానికి గాను పంట రుణాలను 41.78 శాతానికి, కాలావధి రుణాల్లో 147.41 శాతానికి పెంచింది. ఈ ఏడాది ఖరీఫ్ కాలానికి కేటాయించిన 7,500 కోట్ల రూపాయలలోని ఆగస్టు 25 నాటికి 5,066 కోట్ల రూపాయలను పంపిణీ చేసింది. గత సంవత్సరంతో సరిపోల్చి చూస్తే ఇది 1161 కోట్ల రూపాయలు ఎక్కువ.

## ప్రభుత్వం చేపట్టిన చర్యలు

మన రాష్ట్రంలోని గరిష్ఠ సంఖ్యలోని రైతులను రుణ సహాయం అందేందుకు రాష్ట్ర ప్రభుత్వం సత్వర ఆదేశాలు జారీచేసింది. అవి సక్రమంగా అమలు జరిగేందుకు వ్యవసాయ శాఖలోని యంత్రాంగం చురుగ్గా వ్యవహరిస్తోంది.

- పట్టాదారు పాసుపుస్తకాలు లేవన్న కారణంతో రుణాలు పొందలేకపోతున్న రైతులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్ల ద్వారా సహాయం అందించాలని జిల్లా కలెక్టర్లకు ఆదేశాలు జారీ అయ్యాయి.
- ఈ విషయమై రాష్ట్ర వ్యవసాయ శాఖ, బ్యాంకులు విస్తృత ప్రచారాన్ని నిర్వహిస్తున్నాయి.
- ఇంతవరకు గ్రామీణ పరపతికి నోచుకోని రైతుల జాబితాను రూపొందించాలని, ఆ జాబితాలోని రైతులకు గ్రామీణ పరపతి సంస్థల ద్వారా రుణాలు అందేలా చూడాలని జిల్లా కలెక్టర్ల పర్యవేక్షణలో ప్రభుత్వ యంత్రాంగం పెద్దఎత్తున కృషి చేస్తోంది. ఇప్పటివరకు 13.56 లక్షల రైతులు ఆ జాబితాలో చోటు చేసుకున్నారు. ఒక్కో బ్యాంకూ ఇప్పుడు ఉన్న సంఖ్యకు అదనంగా నూరుగురు రైతులకు రుణలివ్వాలని ప్రతిపాదనలు వెళ్లాయి. ఈ ఏడాది కనీసం 4.90 లక్షల మంది అదనపు రైతులకు 1345 కోట్ల రూపాయల రుణాలు బ్యాంకుల ద్వారా అందజేయబడతాయి.
- నాబార్డ్ రూపొందించిన మార్గదర్శక సూత్రాల సహాయంతో విశాఖపట్నం, గుంటూరు, అనంతపురం, కడప, నిజామాబాద్, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 6000 రైతు మిత్రా గ్రూపులను రుణ సహాయం కోసం గుర్తించడం జరిగింది. వివిధ బ్యాంకులు, వాటి శాఖలు చిన్నతరహా, మధ్యతరహా రైతులకు రుణాలను పంపిణీ చేస్తున్నాయి.
- అన్ని రకాల పంటలకూ పూర్తిస్థాయి పరపతి లభించేలా జిల్లా కలెక్టర్లు, జేడీయేలు, బ్యాంకు అధికారులు కృషి చేస్తున్నారు.

## కరువు బారినపడ్డ రైతులకు బకాయిలపై ఊరట

- ఇంతవరకు రైతులు బకాయిపడ్డ అసలు, వడ్డీలను 2004 మార్చి 31 నాటి అసలు మొత్తంతో కలిపి, దీన్ని ప్రస్తుతం అమలులో ఉన్న వడ్డీ రేట్లలో అయిదు సాంవత్సరిక వాయిదాల్లో రైతులు చెల్లించేందుకు ప్రభుత్వం వీలు కల్పించింది.
- గతంలో బకాయిలు ఉన్న రైతులకు కొత్త రుణాలు అందేలా నాబార్డ్ మార్గదర్శక సూత్రాలను వెలువరించింది.
- క్షామపీడిత బడుగు రైతులకు తోడ్పడేందుకు సల్పకాలిక రుణాలతో అసలు మొత్తాన్ని మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది. చిన్న, మధ్యతరహా రైతులు తమ స్వల్పకాలిక రుణాలపై చెల్లించాల్సిన వడ్డీలను ప్రస్తుతానికి వాయిదావేసి, రాబోయే పంట కాలంలో చెల్లించేలా ఏర్పాట్లు చేయడం జరిగింది. వీటికి చక్రవడ్డీ వర్తించకపోవడం గమనించాల్సిన విషయం.
- పరపతిని అవసరాలకు అనుగుణంగా పొందేందుకు వీలుగా బ్యాంకులు కిసాన్ క్రెడిట్ కార్డులను రైతులకు అందజేస్తున్నాయి. ప్రస్తుతం 56.6 లక్షల మందికే ఇవి అందుబాటులో ఉన్నాయి. ఇంకా 43.4 లక్షల మంది రైతులకు వీటిని అందించేందుకు బ్యాంకులు కృషి చేస్తున్నాయి.
- 5.85 లక్షల రైతులు చెల్లించాల్సిన 1417 కోట్ల రూపాయల పంట రుణాలను మధ్యకాలిక రుణాలుగా మార్చడం జరిగింది.

జారీచేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

RNI Regn. No. APTEL/2003/11482
PRINTED BOOK
Postal Regn. No. LII/RNP/H-HD-1029/2004-06


రాయితీలు పొందుతున్నాయి. అందువల్ల ప్రభుత్వ ప్రైవేట్‌రంగాలు రెండూ ప్రజారంగాలే! ఈ రెండు రంగాలకే దేశ ప్రజల అభివృద్ధిని తీర్చిదిద్ద వలసిన బాధ్యత సమంగా ఉంది.

భారతదేశంలో కొనసాగుతున్న "రిజర్వేషన్" విధానం-భారతదేశంలోపాటు-మలేషియా-అమెరికా-న్యూజిలాండ్-దక్షిణాఫ్రికా లాంటి దేశాలలో రిజర్వేషన్ విధానం వుంది...అంచేత ఆయా దేశాలలో మంచి మంచి కార్యక్రమాలు అమలు చేయబడి-నిర్లక్ష్యానికి గురైన ప్రజలను-ప్రజాస్వామ్య అభివృద్ధి క్రమంలోకి తీసుకరావటానికి ప్రయత్నాలు జరిగాయి...జరుగుతున్నాయి..... ఇవి హర్షించదగ్గ విషయాలు.

'2004-అంతర్జాతీయ మానవాభ్యుదయ నివేదిక'- నివేదిక సంకలనకర్త నోబుల్ బహుమతి గ్రహీత అమర్త్యసేన్.

ఏ దేశంలోనయినా, ఆ దేశంలోని ప్రజలకు ఆర్థిక సామాజిక న్యాయాలు అందుబాటులో ఉండాలి. ఒకదేశం ఆర్థికంగా ఎంత అభివృద్ధి చెందిందనే విషయాన్ని అంచనా వేయడానికి ఆ దేశంలోని ప్రజలు సాధించిన ఆర్థికాభివృద్ధే కొలమానంగా ఉండాలి. ఈ లక్ష్యాన్ని సాధించేందుకు అనేక దేశాలలో ప్రయత్నాలు జరిగాయి. 1987లో దక్షిణాది దేశాల అభివృద్ధికోసం ఏర్పడిన 'సౌత్ కమీషన్' సమర్పించిన నివేదిక" నేడు (1990) భూగోళంలో దక్షిణాది దేశాల ముందున్న భయంకరమైన సకాలు 'ఆకలి'ని తొలగించడం. ప్రజలందరికీ మానవ అవసరాలను తీర్చిననాడే అది సాధ్యమవుతుంది. యజమానులు-బానిసలు, పెత్తందార్లు-సేవకులు, దోపిడీదారులు-దోపిడీకి గురయ్యేవారు గల ఈ దేశాలలో ప్రజలకు 'స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం లాంటి ప్రజాస్వామిక విలువలను చేకూర్చి, ఆత్మగౌరవంగల జీవితాలను ప్రసాదించాలి" 'సౌత్‌కమీషన్ ప్రధాన కార్యదర్శి మన్మోహన్‌సింగ్ నివేదిక(1987).

ప్రపంచదేశాలలో ప్రజలందరికీ అన్నిరంగాలలో ప్రవేశం కల్పించే రిజర్వేషన్ విధానం ముఖ్యమైనదని భావించే దేశాలు అనేకం ఉన్నాయి. దేశవ్యాపితంగా అన్ని రాష్ట్రాలలో విద్యాసౌకర్యాలు అభివృద్ధి చెందాయి. దళిత, బహుజనులు ఉన్న అవకాశాలను ఉపయోగించుకొని ఇంజనీరింగ్, మెడిసన్, తదితర పోస్టుగ్రాడ్యువేట్ కోర్సుల్లో అర్హతలు సంపాదించుకుని ఉద్యోగాలలో పోటీని ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నారు. రాజ్యాంగంలో దళితులకు కల్పించిన రక్షణలు కుల వివక్షకు వ్యతిరేకంగానే తప్ప, రాయితీలకోసం కాదని జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్ అన్నారు.

జాతి నిర్మాణంలో భాగస్వామ్యం పొందడం ప్రజలందరి ప్రాథమిక హక్కు. ప్రభుత్వరంగంతో బాటు ప్రైవేట్‌రంగంలో కూడా దళిత బహుజనులకు రిజర్వేషన్లు కలిగించాలి. ఈ దేశ మూలవాసులు, భూమిపుత్రులైన దళిత బహుజనులను తక్కువగా అంచనా వేయడం తగదు. ఈ దళిత బహుజన, భూమి పుత్రుడే ప్రపంచ ప్రఖ్యాత ప్రప్రథమ 'మహంజదార్, హరప్పా' నాగరికత నిర్మాతలు. నాటినుంచి నేటివరకు 'నవభారత సౌధనిర్మాణా' నికి రాళ్ళెత్తిన యోధులు. నవభారత నిర్మాతలు.

'రామాయణాన్ని రచించిన వాల్మీకి మావాడు. మహాభారతాన్ని భారతజాతికి బహుకరించిన వేదవ్యాసుడు మావాడు. ప్రపంచంలోనే ఉత్తమమైన లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని భారత జాతికి అంకితం చేసిన అంబేద్కర్ మావాడు. వారి ప్రతిభా పాటవాలతో పునీతమైన అనువంశిక విజ్ఞానం, శక్తి సామర్థ్యాలు మా రక్తంలో ప్రవరిస్తున్నాయి'-దళిత బహుజనులు.



Owned, Printed and Published by V.Hanumantha Rao at D.No.8-3-898/22, Road No.3, Nagarjuna Nagar, Hyderabad-5000 073 Ph: 23748672, DTP at Samata Graphics, Hyderabad. Printed at Akruti, Chikkadapalli, Hyderabad. Editor: V.Hanumantha Rao

VEEKSHANAM
TELUGU FORTNIGHTLY
1070, NAGARJUNA NAGAR
HYDERABAD-500073

# స్వావలంబన-3

ఉదయం లేవగానే పళ్ళు తోముకోవడం అనేది భారతీయులందరికీ సర్వ సాధారణమైన అలవాటు. ఆహార పదార్థాలలోని సూక్ష్మక్రిములు పళ్ళ సందులలో చేరి నోటి ఆరోగ్యానికీ, తద్వారా మొత్తంగా మనిషి ఆరోగ్యానికీ ప్రమాదకరంగా మారతాయి గనుక రోజుకు ఒకసారో, రెండుసార్లో పళ్లు తోముకోవాలనేది ఆరోగ్య సూత్రం. ప్రతి సరుకుకూ ఒక ఉపయోగ విలువ ఉంటుందన్నట్టుగానే పళ్ళు తోముకోవడానికి ఉపకరించే సరుకులకూ ప్రాథమికమైన ఉపయోగ విలువ ఉంటుంది.

ఐతే పళ్ళు తోముకునే పదార్థాలు సరుకుల రూపం ధరించి మారకపు విలువల రూపం ఎత్తి లాభాలు ఆర్జించే సాధనాలు కావడానికి ముందు శతాబ్దలపాటు మనిషికి ఆ పదార్థాలతో సంబంధం వుంది. పళ్ళు తోముకునే సాధనాలు సమాజానికి మార్కెట్ ద్వారా కాక మార్కెటేతర రూపాలలో అందిన శతాబ్దాల చరిత్ర ఉంది.

పళ్ళు తోముకోవడానికి మనుషులు సహజమైన నీటిని వాడుకోవడంతో పాటు ఇంకా ఎక్కువ సమర్థంగా ఉండేందుకు ఔషధ విలువలు చెట్ల రెమ్మలను, వేర్లను, చిన్న పొదల కాండాలను, ఆకులను వాడుకున్న, వాడుకుంటున్న సందర్భాలు ఉన్నాయి. నిజానికి బహు ఆడంబరమైన ప్రచారంతో వస్తున్న బహుళజాతి సరుకుల కన్న ఈ సహజ పదార్థాలే ఎక్కువ సమర్థంగా పనిచేశాయి. ప్రకృతికీ, మనిషికీ దూరం పెరిగిన కొద్దీ, పట్టణీకరణ పెరిగిన కొద్దీ ఈ సహజ వనరుల లభ్యత, వినియోగం తగ్గిపోయాయి.

క్రమంగా చిన్న పట్టణాలలో, 'నాగరికత' పేరుమీద కొత్త విలువలు ప్రచారంలోకి వచ్చిన ప్రాంతాలలో సహజ దంత ధావన పదార్థాల స్థానాన్ని మరొకస్థాయి పదార్థాలు ఆక్రమించాయి. ఉప్పు బొగ్గు, కచ్చిక (కాల్చిన పిడక), ఇటుకపొడి వంటి గరుకుగా, ఉప్పగా, కొంతవరకు ఔషధ లక్షణాలతో ఉండే పదార్థాలు వాడకంలోకి వచ్చాయి. బొగ్గుపొడిని గాని, ఇటుకపొడిలా కనబడే పదార్థాన్ని గాని, ఔషధాలు కలిపి స్థానికంగా ఉత్పత్తిచేసి అమ్మడం ప్రారంభమైంది. ఒక సహజ అవసరం కోసం, ఒక సహజంగా దొరికే వనరును వాడుకోవడం అనే స్థితి నుంచి, ఒక సహజ అవసరం కోసం పారిశ్రామికంగా తయారు చేసే సరుకును సరఫరా చేయడం అనే స్థితి వచ్చింది. ఇది మనదేశం మొత్తంగా గాని, తెలుగు సమాజంలోనే గాని గత శతాబ్ది మధ్య భాగంలో మొదలై ఏడో, ఎనిమిదో దశకాల కల్లా విస్తరించింది. అంటే దంత ధావన పదార్థాలు సహజమైన స్థితినుంచి అసహజమైన స్థితికి, సరుకు స్థితికి, పారిశ్రామిక స్థితికి ప్రయాణం చేశాయి. మార్కెటేతర సంబంధం నుంచి మార్కెట్ సంబంధానికి పరిణమించాయి.

అప్పటికి కూడా నోటి శుభ్రతా పదార్థాల పరిశ్రమ దేశీయ, స్థానిక పరిశ్రమగానే ఉండింది. ఒక ప్రాంతంలో ఒక ఫారుఖీ దంత మంజన్, మరొక ప్రాంతంలో మరొక గణేశ్ పళ్ళపొడి లాగా గుత్త పెట్టుబడికి, ఇబ్బడి ముబ్బడి లాభాలకు అవకాశం లేని స్థానిక పరిశ్రమలే నడుస్తుండేవి. వాటిలో స్థానిక, చిన్న పెట్టుబడిదారుల పెట్టుబడి ఉండటం మాత్రమే కాక, అది వాడే ప్రజలకు ఆ పదార్థాలతో ఎంతో కొంత సాన్నిహిత్యం ఉండేది.

ఈ స్థితిలో గుత్త పెట్టుబడి ఈ స్థానిక, చిన్న మార్కెట్లన్నిటినీ ఏకంచేసి విశాలమైన మార్కెట్లు స్థాపించదలచింది. ఇది కిందినుంచి ప్రజలమధ్య ఏర్పడే ఐక్యత కాదు. పైనుంచి విపరీతమైన లాభాలకోసం విశాలమైన మార్కెట్‌ను కోరుకునే పెట్టుబడిదారీ విధానపు 'వాతాపిజీర్ణం' అనుకునేఐక్యత. ఈ పెట్టుబడిదారీ లాభాపేక్ష వెనుక ఖచ్చితమైన లెక్కలే వున్నాయి. ఇవాల్టి గణాంకాలను బట్టి అంచనా వేస్తే, వందకోట్ల జనాభాలో పదికోట్ల మంది, వాళ్ళ వయసు వల్ల, ఇతరేతర కారణాల వల్ల పళ్ళు తోములోలేని స్థితిలో ఉన్నారనుకున్నా, ప్రతిరోజూ కనీసం తొంభై కోట్ల మందికి పళ్ళు తోముకోవలసిన అవసరం ఉంటుంది. ప్రతిమనిషి సగటున రోజుకు ఐదు గ్రాముల పొడిగాని, పేస్ట్‌గాని వాడుతారనుకున్నా రోజుకు 4,500 టన్నుల దంత ధావన పదార్థం అవసరమవుతుంది. నెలకు 1,35,000 టన్నులు, సంవత్సరానికి పదహారు లక్షల టన్నులు అవసరమవుతుంది.

జనాభాలోని మొత్తం తొంభైకోట్ల మందికి ఈ పొడర్లు, పేస్టులు వాడే అలవాటులేదనుకున్నా, కేవలం మధ్యతరగతికే, అంటే అందులో మూడోవంతైన ముప్ఫైకోట్ల మందికే ఆ అలవాటు ఉందనుకున్నా, దేశంలో ఈ పొడర్లు పేస్టుల మార్కెట్ ఐదు లక్షల టన్నుల పైచిలుకే. ఇవాళ మార్కెట్‌లో యాభై గ్రాముల పొడరు, పేస్టు ఖరీదు రు.5-8 మధ్య ఉంది. అంటే దేశంలో ఈ మార్కెట్ విలువ ఎంత తక్కువలో తక్కువ అంచనా వేసినా సాలీనా రూ.5,000 కోట్ల నుంచి రూ.8,000 కోట్లు ఉందన్నమాట.

ఈ మార్కెట్‌లో మరో కిటుకు ఉంది. ఎఫ్.ఎమ్.సి.జి. రంగంలో పంపిణీ, సరఫరా వ్యవస్థ విస్తృతంగా ఉంటుంది గనుక, ఉత్పత్తిదారు నుంచి చిల్లర వ్యాపారి వరకు కనీసం ఐదు ఆరు అంచెలు ఉంటాయి. గనుక, ప్రతి స్థాయిలోనూ లాభం లెక్కలేసుకుంటారు గనుక ఉత్పత్తి వ్యయానికీ, ధరకూ మధ్య చాలా వ్యత్యాసం ఉంటుంది. అంటే 6 రూపాయలకు అమ్మే డబ్బా, ట్యూబ్ ఉత్పత్తి వ్యయం నిజానికి 3 రూపాయల కన్న తక్కువే వుంటుంది. అంటే రూ.5,000 కోట్ల మార్కెట్‌లో రూ.2,500 కోట్లు మారుబేరగాళ్ళ లాభాలకే పోతుంది.

ఇంత విపరీతమైన లాభాలు ఉన్నాయి గనుకనే బహుళజాతి సంస్థల కళ్ళు ఈ రంగంమీద పడ్డాయి. ఈ మార్కెట్‌మీద సర్వేలు చేయించడం, దంతవైద్యులతో తమ సరుకుల ప్రచారాలు చేయించు